రో యీభాగమును బెంచి వ్రాసియుందురని కాని వాదింపవచ్చును. అట్టియూహ లాధారరహితములును నసంగతములు నగును. ఎవ్వరైన పఠాంత్యముగాఁ దమవాదమును బలపరచి చూపునంతవఱకు, నారణ్య కాండమున నిరువురి కవిత్వ మున్నదనియు, నందొకటి మంత్రిభాస్కర రచితమనియు, నిస్సందేహముగా నిశ్చయింపవచ్చును. రెండవ కవిత్వ మెవ్వరి దను విషయమును గూర్చి తరువాత వ్రాసెదను.

మంత్రిభాస్కరుఁ డయోధ్యాకాండమునుగూడ రచియించెనా?

మంత్రిభాస్కరుఁ డరణ్యకాండమును మాత్రమే రచియించెనా? మఱియేభాగమునైన రచియించెనా? యని యాలోచింప వలసి యున్నది. కొందఱు పండితు లరణ్యకాండమువఱకు మాత్రమే మంత్రిభాస్కరునకు సంబంధముండెనని నుడివియున్నారు. కావున నీవిషయ విచారణ మావశ్యకమైనది. ఏకవియును గ్రంథ మధ్యభాగమును విశేషించి యారణ్యకాండమును రచింప నారంభించి యుండఁడు. బాలకాండమును నయోధ్యాకాండమును నితరు లెవ్వరైన రచియించి యున్నచో నీతఁ డరణ్యకాండమును రచియించెనని చెప్పవచ్చును. కాని యట్టిది లేనప్పు డీతఁ డొక్క యరణ్యకాండమునే రచియించియుండె నని చెప్పరాదు. ఈతఁడు మొదటినుండియు, రామాయణమును రచియించెననియే చెప్పవలసి యుండును. ఈ సందర్భమున నయోధ్యా కాండమును బరిశీలింతము.

ప్రస్తుత ముద్రితప్రతిలో నయోధ్యాకాండమున గద్యపద్యములు ౮౫౦ యున్నవి. ఇందు ౧౩౦ గద్యపద్యములు వెనుకటి ముద్రిత ప్రతికంటె హెచ్చుగానున్నవని పీఠికాకారులే వ్రాసియున్నారు. వెనుకటి ముద్రితప్రతిలోఁగూడ గొన్ని యధికముగాఁ జేరియుండ వచ్చును. మాయూర నున్న తాళపత్రప్రతిలో ౭౬౭ గద్యపద్యము లున్నవి. దీనిని జదివి చూచితిని. కథాసూత్రమెచ్చటను దెగిపోవక

చక్కనిశైలిలో ప్రౌఢముగానున్నది. తాళపత్త్రప్రతికంటె నధికముగా నున్న పద్యములసంఖ్య నిందిచ్చి పాఠకులకు విసుగుకలిగింపఁజేయ నక్కర లేకుండ ముద్రాపకులే సౌకర్య మొనర్చియున్నారు. తాము క్రొత్తగా చేర్చిన ౧౨౭ పద్యములను ముద్రితప్రతిలో [·] నీవిధముగఁ గుండలీకరించియున్నారు. ఇట్టి మార్పుచేయుటలో ముద్రాపకులు కొన్నితావులందుండిచ్చటివచ్చట నచ్చటివిచ్చటఁ జేర్చియున్నారు. అట్టిమార్పులు మాకిచ్చటఁ బాధకములు కావు. తాళపత్త్రప్రతికంటె ముద్రితప్రతిలో నధికముగఁ జెప్పిన ౧౨౭ పోను మిగిలిన ౫౭ పద్యములును అయోధ్యాకాండాంతమున ౪౦౧ మొదలు ౪౫౭ వఱకు నైయున్నవి. ఈ పద్యములకు మాఱుగా నేను జూచిన తాళపత్త్రప్రతిలో నొక్క సీసపద్యము మాత్రమే కలదు. అది యిది:

సీ. అంత నక్కడ రాముఁ డచటికి భరతుండు
        క్రమ్మఱ వచ్చి సామ్రాజ్యమునకు
   తన్ను రమ్మనుచుఁ బ్రార్థన సేయునో యని
        చింతించి యాశ్రమంబుఁ జిత్రకూట
   మునఁ గలమునిజనంబుల వీడుకొని దుర్గ
        తరువిపినంబులఁ గనుచు వేడ్కఁ
   దనరి సీతాసుమిత్రపుత్త్ర సమేతుఁడై దం
        డకావనమహీస్థలికి నరిగె
   ననఁగ నయోధ్యాకాండ మా నభిమతముగ
   వినినఁ జదివిన వ్రాసిన విస్తరించి
   చెప్పినను వారలకును సంసిద్ధి యొసఁగు
   సంపదాయురారోగ్యముల్ సంభవించు.

(ఆరణ్యకాండాదిపద్యముతరువాత "అవధరింపుము" అనిచేర్చి పిమ్మట ౯వ పద్యముతోఁ గలిపి చదువ వచ్చును. ముద్రితప్రతిలోని

యారణ్యకాండము ప్రథమాశ్వాసము ౩వ పద్యమునకు ౧౧వ పద్యమును ౭వ వచనమునకు ౧౨వ పద్యమును పునరుక్తదోషమును గల్గించుచున్నవి చూడుఁడు. ఇట్టివింకను గలవు.

అయోధ్యాకాండమున మొదటినుండి ౨౬౭ పద్యగద్యములను మాత్రమే రచించెననియుఁ బిమ్మట నెవ్వరో తక్కినగ్రంథమును జేర్చి పెంపొందించిరనియుఁ బైని వ్రాసిన వాక్యములవలన స్పష్టమగుచున్నది. అరణ్యకాండము వలెనే యీ పెంపొందించిన భాగము రెండవకవికృతమని నిశ్చయించుటకు సంశయింపనక్కర లేదు. అత్రిమహర్షి యాశ్రమంబున నడచినకథను జేర్చుటయు నచ్చటచ్చట మరికొన్ని కథలను జేర్చి పెంచి వ్రాయుటయు నీరెండవకవి యుద్దేశము. ఈ భాగమును దీసి వేసినను గథకు భంగము కలుగకుండ నడచుచున్నదని పాఠకులు గ్రహింపఁగలరు. ముద్రితప్రతిలోఁ గుండలీకరించిన భాగములోఁ బద్యభాగము కంటె గద్యభాగ మధికముగనున్నది. మఱియు, నయోధ్యాకాండమును రెండు ఖండములుగ విభజించితిమేని, పూర్వఖండమునఁ దాళపత్రప్రతిలో లేనిభాగ మధికముగను, నుత్తరఖండమునఁ నల్పముగను మన్నట్లు గనఁబడును.

అయోధ్యాకాండాంత పద్యములు ముద్రితప్రతిలో నొకవిధముగను, కొన్ని తాళపత్రప్రతులలో వేఱొకవిధముగను నున్నవి. వాని నీక్రిందఁ జూపుచున్నాము.

ముద్రితప్రతి :

ఉ. రాజకిరీటకీలిత విరాజితనూతనరత్నరాజినీ
రాజన మంగళాచరణరంజిత పాదసరోజ ఖడ్గధా
రాజయలభ్యమానరుచిరద్యుతి మన నిశాతకుంభవి
భ్రాజితసద్వితీర్ణ రిపుపార్థివఖండన కీర్తిమండనా!

యాశ్వాసాంతపద్యముల పోలికను బ్రథమావిభక్తిలో నున్నవి. ఆరణ్యకాండాంత పద్యములో "వితరణఖని" యనియు సీపద్యములలో "దానఖని" యనియు నుండుటనుబట్టికూడ నారణ్యకాండ రచయితయు నయోధ్యాకాండ రచయితయు నొక్కఁడే యని యూహింపనగును.

పైని వ్రాసినవానిలో "మందారద్రుమమే" ఇత్యాది మూఁడుపద్యములును గల తాళపత్రప్రతి యందలి గద్య ఆరణ్యకాండ గద్యవలెనే "సకలసుకవిజనవినుత" ఇత్యాది భాస్కరకవిగద్యయే యున్నది. దీనినిబట్టి యయోధ్యాకాండము భాస్కరరచితమని స్పష్టమగుచున్నది. కేవలము గద్యయొక్కటియే యైనచో నది భాస్కరవిరచితమని విశ్వసింపలేము కాని, యాశ్వాసాంతపద్యములు వేఱుగానుండుటనుబట్టియు గ్రంథము ౩౬౮ పద్యములుగలిగి వేఱుగా నుండుటవలనను, ఆరణ్యకాండ రచయితలలోని మొదటికవియు నయోధ్యాకాండ రచయితలలోని మొదటికవియు నేకవ్యక్తి యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అయోధ్యాకాండ కర్తలను నిర్ణయించుట కారణ్యకాండమునకుఁ బడినంతశ్రమ యక్కరలేదు. అయోధ్యాకాండ ముద్రితప్రతిలోని గద్య ననుసరించి, యొకస్థానమును గుమారరుద్రదేవునకును, తాళపత్రప్రతి గద్యనుబట్టి యొకస్థానము భాస్కరునకును నీయవచ్చును. కుమారరుద్రదేవుఁడు, హుళక్కిభాస్కర, దశగతభాస్కర, సత్కవిభాస్కరులలో సమకాలికుఁడు కావునను, సమకాలికులలో నొకఁడు క్లుప్తముగ వ్రాసినదానిని మఱియొకఁడు పెంచి వ్రాయుట సంభవింపదు కావునను, అయోధ్యాకాండ కర్తృత్వము నిస్సంశయముగ మంత్రిభాస్కరునకు సంక్రమింపకతప్పదు. అయోధ్యారణ్యకాండ కర్త యొక్కఁడే కావున, ఆరణ్యకాండకర్త హుళక్కిభాస్కరుఁ డను వాదము యుక్తియుక్తము కానేరదు.

### కుమారరుద్రదేవుఁడు గ్రంథచౌర్య మొనర్చెనా?

పై వివర్శనమునుబట్టి యయోధ్యాకాండమును మొదట ౨౬౭ గద్యపద్యములతో మంత్రిభాస్కరుఁడు రచియించెననియు, పిమ్మట దాదాపు ౨౦౦ గద్యపద్యములను గుమారరుద్రదేవుఁడు రచియించి, యందుఁ జేర్చి మొత్తమునకుఁ దనగద్య వేసికొనెననియుఁ దేలుచున్నది. ఇందువలనఁ గుమారరుద్రదేవునిపై గ్రంథచౌర్య మారోపించినవార మగుచున్నాము. ఇది న్యాయమా యని కొందఱడుగవచ్చును. ఎవరిపైనను గ్రంథచౌర్య మాపాదించు నుద్దేశము మాకు లేదు. తాము కనిపెట్టిన విషయములను సత్యాన్వేషణ బుద్ధితో విమర్శించుచు లోకము నెదుట నుంచుట చరిత్రకారుల ధర్మము. ఆ ధర్మమునే మేమవలంబించితిమి. కుమారరుద్రదేవుఁడు, భాస్కరవిరచితములగు గద్యపద్యములను గ్రహించి, వానికి రెండువందల గద్యపద్యములను రచించి చేర్చి, తాను రచించిన భాగమును సాహిణిమారన కంకితముచేసి, తానువ్రాసికొనిన ప్రతియందు, రెండుగద్యములును, రెండువిధములగు కాండాద్యంత పద్యములును వేసియుండును. తత్ప్రతి కావి లేఖకులు కొందఱీ రెండువిధములగు వ్రాఁతలలో నొకదానిని విడిచివేసి తమయిష్టమువచ్చిన యొక గద్యను, ఒకవిధమగు నాద్యంతపద్యములను వ్రాసికొని యుందురు. అందుచేతనే కొన్నిప్రతులలో భాస్కరవిరచితకాండాంత పద్యములును గుమారరుద్రదేవుని గద్యయు నుండుట సంభవించినది. ఇట్టి తబ్బిబ్బులు కొన్నికొన్ని తాళపత్రప్రతులలో యుద్ధకాండమునందుఁ దక్కిన కాండములయందుఁ గన్పట్టుచున్నవి. ఈయూహయందు సత్యముండెనేని, కుమారరుద్రదేవునియందు గ్రంథచౌర్య దోషముండదు.

### అరణ్యకాండ ద్వితీయకవి యెవరు?

అయోధ్యాకాండ ద్వితీయకవి కుమారరుద్రదేవుఁడని యనుకొన్నారము. అరణ్యకాండమును బెంచి వ్రాసినకవి యెవ్వరని యోచిం

ప వలసియున్నది. ఇదికూడఁ గుమారరుద్రదేవుఁడుగాని మల్లికార్జున భట్టుగాని యై యుందురని నాయూహ. వీరిరువురు తప్ప నితరు లెవ్వరును గారని నానమ్మకము. వీరిరువురిలో నెవ్వరో నిశ్చయించుటకు నాకాధారములు లభింపలేదు. కాని కుమారరుద్రదేవుఁడై యుండు నని నాతలంపు. కుమారరుద్రదేవుఁ డయోధ్యాకాండ గద్యను మార్చి నట్లారణ్యకాండగద్య నేల మార్పలేదని కొందఱడుగవచ్చును. ఆరణ్య కాండాంతగద్యలోఁగూడ భాస్కరునిది గాక మఱియొకరిదికూడ నుండి యుండనయు, దానిని లేఖకుడు దీసికొనియుండఁ డనియుఁ దాళపత్రప్రతులింకను బరిశోధించినచో నవి బయటపడునని నా నమ్మకము. లేదా ఆరణ్యకాండమును దాను రచించినట్లు వేసికొనిన చో నెన్నెనఁ గీడు మూడునేమో యను భయముచేతను నాకాండ మునఁ దాను కొంతభాగమును మాత్రమే వ్రాసియుండుటను మొత్త మంతయుఁ దాను రచించినట్లు ప్రకటించుకొని యాకీర్తినంతను దన నెత్తిపై వేసికొనుట కిష్టము లేకయు భాస్కరుని గద్యము నీరెడవకని మార్పకపోయి యుండును. భారతారణ్యపర్వశేషమును రచించిన యెఱ్ఱాప్రగడ తన పేరున గద్యమును వ్రాసికొనక నన్నయ పేరుననే గ్రంథము నుంచుటకుఁగూడ నిదియే కారణమై యుండును. అంతటి మహా కవుల కిట్టి మూఢనమ్మకము లుండునాయని తలంపరాదు. గొప్పనాగరికులని చెప్పుకొనెడివారిలో నిప్పుడుకూడ నిట్టి నమ్మకము లున్న వారు కలరు. ఆవిషయములనిటఁ దెలుపుట యప్రస్తుత ప్రసంగము. మంత్రిభాస్కరుఁడు ప్రతి కాండాంతమునను ఫలశ్రుతిపద్యము వ్రాసి నట్లు కనఁబట్టుచున్నది.

అయోధ్యాకాండ ఫలశ్రుతిని పైని వ్రాసియున్నాఁడను. ఆరణ్యకాండ ఫలశ్రుతి పద్యమిది:

సీ. ఆ సరోవరమునయందు నృపాత్మజు
లతి శయస్నానపానాదివిధులు
ప్రియమునఁ జల్పి సంప్రీతాంతరంగులై
తత్సమీపోన్నత తరుచయంబు
శీతలచ్ఛాయ వాసీనులై విశ్రమం బంది
కొండొకంతడ వచట నిలిచి
సౌఖ్యంబు నొంది సత్సేవ్యమైన యీ
యారణ్యకాండంబు నర్థితోడ

గీ. వినినఁ జదివిన వ్రాసిన విస్తరించి
చెప్పినను వారలకు సౌఖ్యసిద్ధి యగుచు
సంపదాయురారోగ్యముల్ సంభవించు
సతులపుణ్యంబు లెప్పుడు ననుభవింతు.

బాలకాండఫలశ్రుతిపద్యము నాకు లభింపలేదు.

బాలకాండమున మంత్రిభాస్కరుని కవిత్వ ముండెనా?

అయోధ్యారణ్య కాండములయందు మంత్రిభాస్కరుని కవిత్వ మున్నదని నిర్ణయించినప్పుడు బాలకాండలో నాతనిరచన మున్నదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. కాని యీ రెండుకాండములలోను స్పష్టముగాఁ దెలిసిట్లు బాలకాండమున నావిభేదముఁ దెలుపు తాళపత్రప్రతులు నాకు లభింపలేదు. నేనుజూచిన తాళపత్రప్రతులలోఁ జాల భాగము ముద్రితప్రతితో సమానముగనే యున్నవి. కాని యొక ప్రతిలో కొన్నిభేదములు గానవచ్చినవి. అందు మచ్చునకు మూఁడు పద్యముల నుదాహరించెదను. ఇట్టి వింకను గలవు.

ముద్రితప్రతి:— (ఇదికూడా వ్రాఁతప్రతిలో నివనియే ముద్రాపకులు వ్రాసి యున్నారు.)

చ. ధనము లసిల్లు తొమ్మిదినిధానములున్ దన యింట నుండఁగా
నరుఁ డట యొక్కరింత పరిణామము చూపఁడు కేశిరోధరై
తరమియు తేరు దీసికొని తమ్ముఁ డటంచును గిన్నరేశునిన్
శిరి నిముతోడి చుట్ట మని తిట్టుదు రప్పురి వైశ్యపుంగవుల్. 32

మ. బలవంతంబున లావునన్ విపులశుంభద్దేహముల్ దాల్చి తా
మిల కొండ్లన్ వడి దున్ని సస్యములచే నింపారఁ బూరించి రా
సులు గాఁ జేతురు ధాన్యముల్ సుగుణులై పెంపొంది యర్వటిలో
పల నెల్లప్పుడు నందుశూద్రులు ధరన్ బ్రాహ్మణ్యసేవార్థులై 33

* 34 ఇది యొకవచనము.

గ్రంథవిస్తరభీతిచే నీయు లేదు. ముద్రితప్రతిని జూడుఁడు. వీనికి బదులుగాఁ దాళపత్రప్రతిలో నీక్రిందిపద్యము లున్నవి.

గీ. శరధికైనను రత్నముల్ చాల నొసఁగ
నలకుబేరుని కంబుఁబంచి యిట్లఁ
జాలియున్నట్టి వైశ్యు లసంఖ్యముగను
మెరసియుందురు తత్పురవరమునను.

క. క్షత్రియసంసేవో
దీక్షమహాత్ములు గలిగి ధృతిచే హిమవ
త్క్షోణీధరంబులో యనఁగాఁ
బూర్ణులునై యుందు రెపుడు బుగ్గకలశూద్రుల్.

* 34 వ వచనమునకు బదులుగా నీక్రింది పద్యగద్యములున్నవి.

క. ధాత్రీసుత రామునకు సౌ
మిత్రికి నూర్మిళను బ్రియము మెయి నొగ్గె కేయీ
పుత్రునకు మాండవి మఱి
శత్రుఘ్నునకు శ్రుతకీర్తి సమ్మతిని చ్చెన్.

వ. అప్పుడా రాఘవుల కగ్నిసన్నిధి నిగమోక్తక్రమంబులఁ బాణి
గ్రహణంబులు చేసి యగ్నిదేవునకు మునులకు దశరథ జనకులకు
నమస్కరించి బహువిధాశీర్వాదంబుల విలసిల్లు నాసమయంబున,

ఈ యుదాహరణములనుబట్టి బాలకాండమునఁగూడ నిరువురి కవిత్వమున్నదనియు నందొకఁడు మంత్రిభాస్కరుఁ డనియు రెండవ యాతఁడు మల్లికార్జునభట్టనియు నిశ్చయింపవచ్చును. బాలకాండ ముద్రితప్రతిలో ౭౮౩ గద్యపద్యము లున్నవి. ఇందు ౮౦౦ గద్య పద్యములు మంత్రిభాస్కరుని వనియుఁ దక్కినవి మల్లికార్జునుని వనియు ననుకొనవచ్చును. అయోధ్యారణ్యకాండముల యందలి మంత్రిభాస్కరుని కవిత్వరీతినిబట్టి చూచినచో నాతఁడు కథాపట్టులను గలుపుటకై స్వల్పవాక్యములతోఁ గూడిన వచనరచనము దప్ప గద్యరచనము నందు విశేషాభిరుచి కలవాఁడు కాఁడనియు, కథాంశమును ప్రౌఢమైన శైలిలో రచించుటయం దెక్కువ యిష్టము కలవాఁడుకాని, వర్ణనాంశముల యందభిలాషకలవాఁడు కాఁడనియుఁ, దోఁచగలదు. బాలకాండమున ౧౬ పెద్దవచనములును దాదాపు ౧౩౦ సామాన్య వచనములును. ౫౦ పఱకు కథపట్టులను గలుపు చిన్న వచనములునుగలవు. ఈ గద్యభాగమున, నే స్వల్పసంఖ్యగల చిన్నగద్యములో దక్కఁ దక్కిన వన్నియు మల్లికార్జునుని రచనమని చెప్పవొప్పును. మొదటి ౩౫ పద్యములలో ౩వ పద్యము మాత్రమే భాస్కరునిదై యుండును భాస్కరుఁడు విశ్వామిత్ర చరిత్రము నంత విస్తరించి, చెప్పియుండఁడని నాయూహ. వాల్మీకి రామాయణములో లేని కొన్ని విషయములను మల్లికార్జునభట్టు, అధ్యాత్మరామాయణాదులనుండి యాంధ్రీకరించెనని పీఠికాకారులు వ్రాసియున్నారు, వాల్మీకిరామాయణమునె సంక్షేపముగా నాంధ్రీకరింపఁదలఁచినవాఁడు మంత్రిభాస్కరుఁడు. అట్టి యాతఁ డీపనికిఁ బూనుకొనఁడు కదా! బాలకాండమున మంత్రిభాస్కరునిపద్య

ము లేవో నిశ్చయముగాఁ జెప్పఁజాలము. కాని దిఙ్మాత్ర సూచకముగాఁ దెలిసికొనుటకై పై వాక్యములను వ్రాసితిని.

## భాస్కరరామాయణమున నవతారిక లేదేమి?

ప్రస్తుతము మనకు దొరకుచున్న ముద్రితప్రతులలోఁగాని, తాళపత్రప్రతులలోఁగాని, భాస్కరరామాయణమున నవతారిక లేదు. ఇందులకుఁ గారణమేమైయుండునని యాలోచింపవలసియున్నది. "ఏకవియును దనయిష్టదైవమునుఁ బ్రార్థింపకుండ గ్రంథారంభము చేయఁడు. మంత్రిభాస్కరుఁడు కృత్యాదిని రచియించియే యుండును. అది యాతని గ్రంథముతోఁ బాటుగ నశించియుండును." అని కొందఱను చున్నారు. కాని యీయూహ కొంతబాధకము గన్పట్టుచున్నది. మంత్రిభాస్కర రామాయణ ముత్సన్నము కాలేదు. అయోధ్యారణ్య కాండములు యథామాతృకములుగా నున్న తాళపత్రప్రతులు లచ్చటచ్చట గన్పట్టుచున్నవి. అట్లే బాలకాండముగూడ యథామాతృకముగా నున్న ప్రతి యెన్నటికైన లభింపకపోదని నాయాశ. అది లభించి నేని యవతారిక యుండెనో లేదో నిశ్చయముకాఁగలదు. అంతవఱకు నీవిషయము నిదమిత్థమని నిశ్చయముగాఁ జెప్పఁజాలము. భాస్కరుఁడు కృత్యాదిని రచియింపలేదని యనుకొనుటకుఁగూడ నవకాశము కలదు. గ్రంథమంతయు రచించినపిదపఁ గృత్యాదిని రచించు నాచారమిప్పుడు మనలోఁ గలదు. భాస్కరుఁడుకూడ నట్లే తలంచియుండెనేమో! గ్రంథము సాంతము కాకపోవుటచేఁ గృత్యాది వ్రాయబడక పోయి యుండవచ్చును. పూర్వకవి ప్రణీతము లగు గ్రంథములలో నవతారికలు లేనివి కొన్నికలవు. కృత్యాదిని వ్రాయకుండ గవులు చనిపోవుటచే నాతని తనయుఁడో శిష్యుఁడో దానిని వ్రాసి పూర్తి చేసిన గ్రంథములును గలవు.

భాస్కరుని కృత్యాది లేకపోయిన మానె మల్లికార్జునభట్టైనను నవతారిక వ్రాయలేదేమనుప్రశ్న రాకమానదు. దీనికిఁ దృప్తికరమైన సమాధానము గానరాలేదు. గ్రంథమంతయుఁ బూర్తియైనపిదప నవతారికను వ్రాయవచ్చునని తలంచినాఁడను సమాధాన మీతనిపట్ల వర్తింపదు. ఈతఁడు వ్రాయఁదలఁచినది సుందరకాండాంతమునకును మాత్రమే అదిపూర్తియైనది. అవతారిక వ్రాయఁదలఁచినచో వ్రాయుటకుఁ దగిన యవకాశమున్నది. కాని యీతఁడు వ్రాయలేదు. మంత్రిభాస్కరవిరచిత బాలకాండమునందుఁ దానుఁ గొంతగ్రంథము నధికముగఁ జేర్చుటమాత్రమే చేసి యుండుటచే వేఱుగ నవతారిక వ్రాయ నిష్టములేక మానివేసెనేమో చెప్పఁజాలము. కాండాంతపద్యములను వేఱుగ శివపరముగ వ్రాసి వేఱుగఁ దనగద్యను వ్రాసికొనిన యీతఁడు కృత్యాదినేల వ్రాయకుండునని కొందఱనవచ్చును. అవతారిక వ్రాయఁదలపెట్టెనేని బాలకాండమునఁ దన కెంత ప్రసక్తి యున్నదనియు స్పష్టముగాఁ జెప్పవలసి వచ్చును. అందుచే నాతఁడు దానిని వ్రాయక యుండవచ్చును. మల్లికార్జునభట్టునైనను గూడ గ్రంథచౌర్యమారోపింపలేము. అయోధ్యాకాండ రచనావిచారణ సందర్భమునఁ గుమారరుద్రదేవునిఁగూర్చి వ్రాసిన వాక్యములు మల్లికార్జున భట్టునకు గూడ ననువర్తింపఁ జేయవలసియుండును.

## కిష్కింధా సుందరకాండములలో మంత్రిభాస్కరుని కవిత్వ మున్నదా?

మంత్రిభాస్కరుని కవిత్వ మారణ్యకాండముతో నాగిపోయెనని నిశ్చయింపఁజాలము. కాని మొదటి మూఁడు కాండములలోవలె నీ రెండు కాండములయందును నాతని కవిత్వ మున్నదని నిరూపించుటకు దగిన సాధనములు లభ్యములు కాలేదు. కొన్ని తాళపత్రప్రతులయందీ రెండు కాండముల తుదిగద్యలు. "ఇది సకలసుకవిజనుత"

మొదలుగా భాస్కరుని పేర నుండుటచేత, సుందరకాండాంతము వఱకును భాస్కరుఁడు రచించి యుండవలయు, యుద్ధకాండమునఁ గూడ గణింపదగని యేయల్పభాగమో రచియించియుండుననియుఁ దోఁచుచున్నది. కొన్ని తాళపత్రప్రతులలోని గద్యములను బట్టి యిట్లూహించుట న్యాయము కాదని కొందఱందురేమో! ఆవాదమునందుఁ గూడ సత్యముండవచ్చును. ఎట్లయిన నీ విషయమున నింకను బరిశోధన మావశ్యకమయి యున్నది. ఈ కాండములలో నేను చూచిన తాళపత్రప్రతులకును ముద్రితప్రతికిని విశేషభేద గన్పడ లేదు.

కిష్కింధా కాండాంత పద్యములలో ముద్రితప్రతియందీ క్రింది పద్యము కన్పట్టుచున్నది.

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీకేతకలాసరస్వతి కళింగాంగశ్రీః పురీకాల్లికా
వాటీపంజరి గౌడవామనయనా వక్షోజహారావళి మై
పాటింపందగు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ.

ఈపద్యము సాహిణీమారయను సంబోధించుచున్నది. కాండాది పద్యములు గాండాంతమందలి మాలినీవృత్తమును శివపరములుగా నున్నవి. మల్లికార్జునభట్టు తనకవిత్వము నీశ్వరునకుఁ గృతియిచ్చె ననుట స్పష్టము. కావునఁ బైనిఁజూపిన శార్దూలవృత్త మిట నుండఁ దగినదని కాదనియుఁ బ్రక్షిప్తమనియు నిశ్చయింపవలసి యున్నది. ఇంతే కాదు, సాహిణిమారని కంకితమైన యేయితర గ్రంథము నుండియో కొన్ని పద్యములను దెచ్చి భాస్కరరామాయణమున నెవ్వరో చేర్చియుండుదురను యూహ కలుగుచున్నది. వాల్మీకి భాస్కరుఁడు డాంధ్రీకరించి సాహిణిమారని కంకిత మొసంగెనని చెప్పుచు నకగతుల లోని పద్యములను పిలేఖకులిందుఁ జేర్చిరేమో! ప్రస్తుతముద్రితప్రతిని

బట్టి కిష్కింధాసుందరకాండములు మల్లికార్జునభట్ట రచితములనియు సీశ్వరాంకితము లనియు స్పష్టముగాఁ దెలియుచున్నది. "ఇవినిజముగా మంత్రిభాస్కరకృతములైనచోఁ గాండాంత పద్యములీశ్వర సంబోధకములుగాక యొకప్రభువును సంబోధించునవిగా నుండవలసియున్నది. అయోధ్యారణ్యకాండముల కట్టిపద్యములు మనకు లభించినవి మల్లికార్జున భట్టుపేర నున్న మూఁడు కాండములకు నట్టిపద్యములు మనకు దొరకలేదు. దీనికేదేని ప్రత్యేక కారణ ముండి యుండవలయును. అయోధ్యారణ్య కాండములను మంత్రిభాస్కరుఁడు రచియించెనని మన మంగీకరించితిమేని, యాతఁడు బాలకాండమును రచింపకుండ నయోధ్యారణ్యకాండములను మాత్రమే రచియించి యుండఁడు. కావున బాలకాండమున నాతనిరచన మున్నదను నుసిద్ధాంతము నంగీకరింపక తప్పదు. బాలకాండాంతమున మంత్రిభాస్కరుఁడు రచించిన ప్రభుస్తుతి పద్యములు మనకు లభించి, కిష్కింధాసుందర కాండాంత పద్యములు లభింపకపోయినచో నీరెండు కాండములయందు నీతని కవిత్వము లేదని యనుకొనవచ్చును. కాని బాలకాండాంతపద్యములు లభింపకపోవుటచే కిష్కింధాసుందర కాండాంతపద్యములు భాస్కర రచితములు వస్తే లభింప లేదనియు. నవి లభింపనంత మాత్రమున నా కాండములలో భాస్కరుని కవిత్వము లేదని నిశ్చయింపఁగూడా దనియుఁ జెప్పవలసి యున్నది. మల్లికార్జునని పేరనున్న మూఁడు కాండములలోను భాస్కరుని గద్య యుండి యాతని కాండాంతపద్యములు లేకపోవుటకుఁ గారణము విశేషములై యుండవచ్చును.

అయోధ్యారణ్య కాండముల కవిత్వధోరణినిబట్టి చూచినచో మంత్రిభాస్కరుఁడు వాల్మీకి రామాయణమును సాధ్యమైనంతవఱకును వీక్షించి యాంధ్రరామాయణమును రచింపఁదలపెట్టెననియు, మిక్కిలి పొదవుగల వచనములను రచియింప నాతఁడిష్టము లేనివాఁడనియు వర్ణ

నాటకములలో గ్రంథమునుఁ బెంచు నభిలాషకలవాఁడు కాఁడనియు దోఁచును. ఈలక్షణములనుఁ గిష్కింధాసుందర కాండముల కన్వయింపఁజేసి చూచినచో, బాలకాండముకంటెనే యీ రెండుకాండముల యందునుఁ గొంత మంత్రిభాస్కరుని కవిత్వ ముండెననియు మల్లికార్జున భట్టుకాండములనుఁ గూడ వర్ణనాంశములనుఁ బెంచియుఁ వాల్మీకి రామాయణమందు లేని "తార శ్రీరాముని శపించుట, లంకకేగి సీతావృత్తాంతమును గనగోరినవ్వని సంపాతి తనకుమారున కాజ్ఞాపించుట, హనుమంతుఁడు తన జననవృత్తాంతమున గజద్వయవధను జెప్పుట" మొదలగు కథలనుఁ జేర్చియుఁ బెద్దగాఁ జేసెననియుఁ దలంప నవకాశము గలుగుచున్నది. వాల్మీకిరామాయణమునఁ జెప్పినకథలనే సంగ్రహపరచి వ్రాయఁదలఁచిన భాస్కరుఁ డందు లేనికథలనుఁ దెచ్చిపెట్టినాఁడని తలంపరాదు. కిష్కింధాకాండమున దాదాపుగ నిరువదియుఁ సుందరకాండమున నిరువదియుఁ బెద్దవచనము లున్నవి. ఇవి యన్నియు మల్లికార్జునభట్టు పెంచి వ్రాసినవని నాయభిప్రాయము. కిష్కింధాకాండమున ౬౮౫వ సంఖ్యగల వచనమిందుల కుదాహరణము. ఈవచనమునుఁ దీసివేసినను గథాసూత్రము తెగిపోలేదు. ఈపెద్దవచనము లున్నతావులలో భాస్కరుఁడు స్వల్పసంఖ్యగల పద్యములనో చిన్నవచనములనో వ్రాసియుండునని నాయుద్దేశము. కిష్కింధాకాండమున నిప్పుడు ౮౩౦ గద్యపద్యము లున్నవి. ఇందులోఁ, బద్యమధ్యమునఁ గథపట్టులను గలుపుటకై వ్రాయఁబడిన చిన్నగద్యములు దాదాపు ౧౮౦ కలవు. మిగిలిన ౬౩౦ పద్యములలోఁ గందములు ౩౫౦ సుందరకాండమున నున్న గద్యపద్యములు ౫౭౦ లోను, పైనిచెప్పిన రీతి గల చిన్నవచనములు ౧౪౦ పోను మిగిలిన ౮౩౦ పద్యముల లోను గందములు ౨౬౦. యుద్ధకాండమున నున్న గద్యపద్యములు ౨౭౦౦ లోను వచనములు ౮౨౫ పద్యములు ౨౨౭౫ లోనుఁ గంద

ములు ౭౦౦. కిష్కింధా సుందర కాండములయందు మంత్రిభాస్కరుని కవితయుండెనా లేదా యని విమర్శించునప్పుడీ రెండు గమనింపఁ దగినవి. ఈ సందర్భమునఁ బైనిఁ జెప్పిన యుక్తులలోఁ గొన్ని నిశిత విమర్శనమునకు నిలువలేక పోవచ్చును. కాని మొత్తము మీఁద యోచించి చూడఁగా కిష్కింధాసుందరకాండములలో మంత్రిభాస్కరుని కవిత యున్నదనియు, బాలకాండమువలెనే యీ కాండములను గూడ మల్లికార్జునభట్టు పెంచి వ్రాసెననియుఁ దోఁచక మానదు. విశేష పరిశ్రమచేసి, పరిశోధన మొనర్చినచో నయోధ్యారణ్య కాండముల వలెనే, తక్కిన మూఁడుకాండములయందును భాస్కరుని కవిత యెంత యున్నదియుఁ దెలియఁగలదని నానమ్మకము.

## బాల- కిష్కింధాసుందరకాండములయందు భాస్కరుని కవిత్వ మున్నచో నదియేల బయటపడలేదు?

ఈ ప్రశ్న కింకనుఁ దాళపత్రప్రతుల పరిశోధన మావశ్యకమని చెప్పుటతక్క వేఱు తృప్తికరమగు ప్రత్యుత్తరము లేదు. ఈ తాళపత్రప్రతులు లభించుటలోఁ గూడ నొకకష్టమున్నది. మల్లికార్జునభట్టుచేఁ బెంచి వ్రాయఁబడిన రామాయణప్రతులు ప్రచారములోనికి వచ్చినది మొదలు భాస్కరరామాయణప్రతులు మూలఁబడిపోయి యుండును. దీనికి గారణము, మల్లికార్జున రామాయణమున గ్రంథ మెక్కువగా నుండుట, యుద్ధకాండముగూడ మల్లికార్జునభట్టు కాలముననే రచియింపఁబడి యుండుటచే, దానితోఁగూడ గలసినప్రతులను విలేఖకులు వ్రాసికొనుచు వచ్చిరి. ఆ కాలమువారికిఁ దరువాత సమగ్రరామాయణమును విడచి, అసమగ్రముగ నున్న భాస్కరుని ప్రతుల నెవిలేఖకు లను వ్రాసికొనియుండరుకదా! మల్లికార్జునభట్టునకుఁ బూర్వము వ్రాసికొనిన మంత్రిభాస్కరుని రామాయణప్రతులో లేక వాని ప్రతిక

లో వ్రతిరికావ్రతిరికలో మనకు లభింపవలసియున్నది. అట్టివి లభించుట చాలదుర్ఘటము. అదృష్టవశమున నయోధ్యారణ్యకాండప్రతులు దొరికినవి. ఇట్లే తక్కినయూఁడు కాండములునుగూడ లభించునని నా యాశ. ఇప్పుడు ముద్రితప్రతులు విశేషప్రచారములో నుండుటచేఁ దాళపత్రప్రతులను జూచువా రరుదుగా నున్నారు. అందులో మంత్రి భాస్కరుఁడు రామాయణకర్త కాఁడని యిదివఱకు పండితులు సిద్ధాంతీకరించి యుండుటచే, నీవిషయమునఁ బరిశోధన మావసరము లేదని భావించువార లనేకులున్నారు. అందుచే సామాన్యముగా నీవిషయమును గూర్చి పరిశోధనము జరుగుటలేదు. నేను పైనివ్రాసిన యంశములను మనసునందిడుకొని తాళపత్ర పరిశోధనము గావింపవలసి యున్నది.

## భాస్కరరామాయణ పీఠికాకారుల యభిప్రాయము

భాస్కరరామాయణ ముద్రిత ప్రతికిఁ బీఠికవ్రాసిన శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యపండితులు భాస్కరరామాయణములో మంత్రి భాస్కరునకు సంబంధము లేదనియు, హుళక్కిభాస్కరుఁడే రామాయణకర్త యనియు నిశ్చయించి యున్నారు. అందు వారు చూపిన యుక్తులకు గొన్నిటికి (వారివాక్యముల నుదాహరింపక పోయినను) సమాధానములను పైని వ్రాసితిని. కొన్నిటికి మల్లికార్జునాది రామాయణకవుల చారిత్రములలో సమాధానములను వ్రాయఁ బ్రయత్నించెదను. ఈసందర్భమునఁ బీఠికలో శ్రీ యాచార్యులవారి క్రిందివాక్యములను వ్రాసి యున్నారు.

"ఈ రామాయణమునకు భాస్కరరామాయణమని కవిపేరుతోఁ గూడిన నామముతో వ్యవహారముండుటలో నొకవిశేషమున్నది. అది యేదియన నదివఱ కొకరామాయణ మున్నట్లు సూచించుట. భారత

ముండఁగాఁ దరువాత జైమిని రచించినభారతమునకు జైమినిభారతమని పేర్చిన ట్లొక గ్రంథముండఁగా మఱల రెండవదిపుట్టిన దాని సంజ్ఞకు గవిపేరు చేర్చుట లోకములో వాడుకయయి యున్నది. దీనివలన నీ రామాయణమునకు మఱియొక రామాయణము ముందుండవలని యున్నది. అది యెఱ్ఱనకృత రామాయణ మని యూహింపవచ్చును. పింగళి సూరనార్యుఁడు భారతరామాయణ కథను జోడించి వ్రాసిన రాఘవపాండవీయములో:-

ఉ ఏ సొంద నర్థగౌరవసమృద్ధియు శబ్దశుద్ధియుం దిరం
బై యనవద్యతం బఁగి నంధ్రవచస్థితి భారతంబు రా
మాయణము రచించిన మహాత్ముల నాన్నఁ దలంచెద జగ
ద్గేయుల నన్నపార్యులని దిక్కసుధీమణి నెఱ్ఱపక్కవిన్

అని రామాయణమును భారతమును రచించిన పూర్వకవులు వీరు మువ్వురే యని తెలిపియున్నాఁడు. ఈపద్యము తిక్కనకుఁబూర్వము మంత్రిభాస్కరునిచే రామాయణము రచింపఁబడి యుండలేదని తెలియఁజేయుటచేఁ గాక భాస్కర రామాయణముకూడ మొదటిది కాదని సూచించుచున్నది. కాని ప్రతాపరుద్రునికాల మందున్న భాస్కరుఁడు ప్రతాపరుద్రుని తరువాత రాజ్యమాక్రమించుకొన్న యనవేమారెడ్డి కాలములోని యెఱ్ఱాప్రగ్గడకుఁ దరువాత నుండుట యెట్లు సంభవించునను నంశ మాలోచింపవలసియున్నది. ప్రతాపరుద్రుని కాలములో భాస్కరుఁడున్నను నపుడు రామాయణమును రచించియుండలేదు. ప్రతాపరుద్రునితరువాత సాహిణిమారన రాజుకాగా నపుడు రచించెను. ప్రతాపరుద్రుఁడు కారాబద్ధుఁడైన తరువాత దస్సేనానాయకులు స్వతంత్రరాజులైరి. వినుకొండకుఁ బోలయ వేమారెడ్డియుఁ గొండవీడునకు సాహిణిమారనయు రాజులైరి. మొదటఁ బోలయ వేమారెడ్డి

స్వల్పకాలము రాజ్యముచేసి మృతుఁడయిన తరువాత వనవేమారెడ్డి రాజయ్యెఁ గావున కొండవీడను సాహిణిమారుఁడు వినుకొండను వేమారెడ్డియుఁ బాలించుచుండఁగా భాస్కరరామాయణము పుట్టినది. ఇది పుట్టినప్పటికి భాస్కరపుత్రుఁడు గూడ గొప్పకవియై యున్నందున భాస్కరుఁడు కొంతభాగమును రచించియుండుటనుబట్టి, నీగ్రంథము భాస్కరుని ముసలితనమందు రచింపఁబడెనని యూహింపవలసియున్నది. ఇఁక వనవేమారెడ్డికాల మున్న యెఱ్ఱనరామాయణ మాతని యౌవన కాలమున నిర్మింపఁబడినది. అనవేమారెడ్డి కంకితము చేయఁబడిన హరివంశమునకుఁ బూర్వమే రామాయణము రచింపఁబడినట్లు హరివంశ మువలనఁ దెలియవచ్చుచున్నది.

శా. “నాగమ్మందు ఘనుండు మల్లరధినీనాథుండు విన్నాణక
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యొకనిం జిట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యున్నత
ఖ్యాతిం బొందితి నింకనుం దలియ, నేకావ్యామృత స్వాదనన్”

ఇతని గ్రంథములలో నిదియే మొదటిదని తోఁచుచున్నది. కావున నీ రెండురామాయణములలో నెఱ్ఱనది ముందుఁ బుట్టియుండ వచ్చును,

కాఁబట్టి పైని వ్రాసిన యుపపత్తులచే సర్వవిధముల నీరామాయణమును రచించినవాఁడు హుళక్కిభాస్కరుఁడే కాని మంత్రిభాస్కరుఁడు కాఁడని గ్రహింపవలయును.”

శ్రీ యాచార్యులవారి యీ వాక్యములందలి యంశములు చరిత్రకు విరుద్ధములుగా నున్నవి.

పింగళి సూరనార్యుని పద్యములలో శ్రీ యాచార్యులవారు చెప్పినంత యర్థము లేదు. కవిత్రయమును నుతించుటయే యాతని

యుద్దేశము. కాని రామాయణకర్తలను జెప్పుట యాతని తలంపుకాదు. కవిత్రయమువారు భారత రామాయణములను రచించినవారని మాత్రమే సూరనార్యుఁడు చెప్పెను కాని, మంత్రిభాస్కరుఁడు రామాయణమును రచింపలేదని కాని భాస్కరరామాయణము మొదటిది కాదని కాని యాతఁడు చెప్పనుద్దేశింపలేదు. నన్నయ రామాయణకర్త కాఁడు. రామాయణకర్తయైన భాస్కరుఁడు తనకుఁ బూర్వుఁడైనను నాతని వాఁడు నుతింపలేదు. ఈ పద్యమునుబట్టి యెఱ్ఱనరామాయణము మొదటిదని నిర్ధారణచేయఁబూనుట వృథాయాసము. ప్రమాదభరితము.

ఎఱ్ఱాప్రగ్గడ అనవేమారెడ్డికిని కవిగానుండి, రామాయణమును హరివంశము నతనికంకితముచేసి యనుటపరిహాసము. హరివంశరచనము నాఁటి కనవేమారెడ్డి పుట్టెనో లేదో చెప్పలేము. పుట్టినను బదియేండ్లలోపు వయసుకలవాఁడుగా నుండును. హరివంశకృతిపతి ప్రోలయవేమారెడ్డి కాని యనవేమారెడ్డి కాఁడు. ప్రోలయవేముఁడు స్వల్పకాలమాత్రమే రాజ్యముచేసినవాఁడును గాఁడు. క్రీ. శ. ౧౩౨౦ మొదలు ౧౩౪౯ వఱకు ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసినప్రతిభాశాలి అతనికిఁ దరువాత ననవేమారెడ్డి రాజ్యమునకు రాలేదు. ప్రోలయవేముని పెద్దకుమారుఁడైన యనపోతారెడ్డి క్రీ. శ. ౧౩౫౦ మొదలు ౧౩౬౧ వఱకు రాజ్యముచేసెను. అటుపిమ్మట క్రీ. శ ౧౩౬౨ మొదలు ౧౩౮౦ వఱకు ననవేమారెడ్డి రాజ్యమేలెను. ఈ కాలములో నెఱ్ఱాప్రగ్గడ లేఁడు. భాస్కరరామాయణ మింతకుపూర్వమే రచియింపఁబడి యుండెను. వాస్తవముచేత నెఱ్ఱాప్రగడ తనరామాయణమును క్రీ. శ. ౧౩౨౫—౧౩౩౫ మధ్యకాలమున రచియించియుండెను. (యెఱ్ఱాప్రగడచరిత్రమును జూడుఁడు.) భాస్కరరామాయణ మంతకుపూర్వమే రచితమైనది. ఎఱ్ఱనరామాయణము మొదటిదగుటచే రెండవదయిన యీరామాయణమునకు భాస్కరరామాయణమని పేరువచ్చిన

పంతులుగారును, మంత్రిభాస్కరుఁడు రామాయణమునఁ గొంతభాగమును రచియించియుండెనని యభిప్రాయపడియున్నారు. అందుపైని శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు భాస్కరోదంతమను ౭౮ పేజీల గ్రంథమున నీవిషయమును విమర్శించి భాస్కరరామాయణముతో మంత్రిభాస్కరునకు సంబంధము లేదనియు హుళక్కి భాస్కరుఁడే రామాయణ గ్రంథకర్తయనియు నిరూపించియున్నారు. దానినిబట్టి కాఁబోలు శ్రీ వీరేశలింగముపంతులుగారు తమ యభిప్రాయమును మార్చుకొని కవులచరిత్ర రెండవ ముద్రణమున రామాయణకర్త హుళక్కి భాస్కరుఁడని వ్రాసియున్నారు.

భాస్కరోదంతము క్రీ. శ. ౧౮౯౮ వ సంవత్సరమున ననఁగా దాదాపు యేబది సంవత్సరములక్రింద ముద్రితమైనది. పంతులుగారి కవులచరిత్రము రెండవముద్రణమును, భాస్కరోదంతమును, ఇదివిన పిమ్మటఁగూడ నాయభిప్రాయము మారలేదు. మంత్రిభాస్కరుఁడు రామాయణములోఁ గొంతభాగమును రచించియుండెననియే నానిశ్చితాభిప్రాయము. భాస్కరోదంతము నందలివిషయములు కొన్ని సత్యమునకు విరుద్ధముగానున్నవి. ఎఱ్ఱాప్రగ్గడ రచించిన రామాయణకృతిభర్త అనవేమారెడ్డియని భాస్కరోదంతము తెలుపుచున్నది అది వాస్తవము కాదు. ఆరామాయణ కృతిభర్త ప్రోలయ వేమారెడ్డి కాని యనవేమారెడ్డి కాఁడు. మంత్రిభాస్కరుని యొక్కయుఁ దిక్కనసోమయాజి యొక్కయు కాలమును భాస్కరోదంతము సరిగా నిర్ణయింపలేదు. ఇట్టివాని కన్నిటికిని వివరముగాఁ బ్రత్యుత్తర మీయవలసివచ్చినచో నది యొకపెద్ద గ్రంథమగును గావున నాపనికిఁ బూనుకొనలేదు. శ్రీపంతులుగారును, శాస్త్రులుగారును చెప్పినయుక్తులకుఁ బైనివ్రాసిన పంక్తులలోఁ గొంతవఱకు సమాధానములున్నవి. మిగిలిన వానికి సమా

ధానములు మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుడు, బాలకీర్తిభాస్కరుడు, అయ్యలార్యుడు ననువారి చరిత్రములయందు వ్రాయఁ బ్రయత్నించెదను. ఇతఁడంతకుంచు భాస్కరోదంతము వంటి పరిమితి గలిగిన వాదములకును సమాధాన మీయవలసిన యావశ్యకత నాకుఁ గన్పట్ట లేదు.

## మంత్రి భాస్కరుని కాలము :

మంత్రిభాస్కరుఁడు పండ్రెండవశతాబ్ది నాల్గవ పాదమునను, పదుమూఁడవ శతాబ్ది ప్రథమపాదమునందు నున్నాఁడని చెప్పవచ్చును. ఇతని నివాసము గుంటూరు అని తిక్కనయే చెప్పుచున్నాఁడు. ఇతని వంశవృక్షమును దిక్కన గోచు యాజి చారిత్రమున నిచ్చుచున్నాఁడను. ఇతఁడు పండ్రెండవ శతాబ్దాంతమున నున్నవాఁడని భాస్కరరామాయణ పీఠికాకారులు వ్రాసిరి, కాని యది సరి కాదు. ఇతఁడు గుంటూరునకుఁ గరణమని కొందఱనుచున్నారు. ఆకాలపు గ్రామకరణములు ప్రభువునకు మంత్రులుగను దండనాయకులుగను కూడ నుండెడివారని యనేక దృష్టాంతములున్నవి. భాస్కరుఁడు మంత్రియుఁగవియు దండనాయకుఁడునై యుండినట్లు నిశ్చయింపవలసియున్నది.

ఈవిషయములనన్నిటిని బరికించి చూడఁగా మంత్రిభాస్కరుఁడు రచింపఁగా మిగిలినభాగము రచియించియు, రచియించిన భాగమును విపులీకరించియు సంపూర్ణరామాయణమును లోకమునకీయవలయునని సంకల్పించుకొని బాలకవిభాస్కరుఁడును మల్లికార్జునభట్టును గుమారరుద్రదేవుఁడును బనిచేసిరని యూహింపనగుచున్నది.

## భాస్కరరామాయణ పరిశోధనము :

మొత్తముమీఁద భాస్కరరామాయణమునుగూర్చి పరిశోధన మింకను నెక్కువగా జరుగవలసియున్నది. భాస్కరరామాయణ తాళ

దని శ్రీ యాచార్యులవారు సాధింపఁజూచిరి కాని, యందు సత్యము లేదు. అనవేమారెడ్డి కాలములో నెఱ్ఱనరామాయణము పుట్టినదను వారివాదము నంగీకరించినచో, భాస్కరరామాయణమే తప్పక మొదటి దగును. భాస్కరరామాయణమను పేరు కొంతకాలము గడచిన పిమ్మట వచ్చియుండును. కవిపేరుతోఁ జేర్చి చెప్పినంతమాత్రమున నదివఱకా పేరుగల గ్రంథముండి తీరవలయునని నిశ్చయించుటయు, దానిని బట్టి వానిపౌర్వాపర్యములను నిర్ణయించుటయు న్యాయము కాదు. సులభముగా బోధపడుటకై కవిపేరుతోఁ జేర్చి లోకము వాడుచుండును. కొందఱు పండితులు భారతమును వ్యాసభారతమని వాడుటకలదు. ఎఱ్ఱాప్రగ్గడ రామాయణ మిప్పుడు లభించెనేని లోకము దాని నెఱ్ఱాప్రగ్గడ రామాయణమనియే వాడుదురు.

సాహిణిమారఁడు కొండవీడును బరిపాలించెననుటకుఁ జారిత్రకాధారములు లేవు. ప్రతాపరుద్రుఁడు క్రీ. శ ౧౩౨౩ లో బందీకృతుఁడయ్యెను. అటుపిమ్మట సాహిణిమారయ రాజయ్యెననియు, వాని కాలములో రామాయణము పుట్టినదనియు నాచార్యులవారి యభిప్రాయము. అట్లయినచో, ౧౧౨౫—౧౩౩౦ ప్రాంతమున భాస్కర రామాయణము పుట్టియుండవలయును. అనవేమారెడ్డి రాజ్యకాలములో ఎఱ్ఱనరామాయణము పుట్టెనన్న వాదము ననుసరించినచో నది క్రీ. శ ౧౩౮౦ ప్రాంతమగును. అది సత్యమునకు విరుద్ధము. ఎఱ్ఱన రామాయణము క్రీ. శ ౧౩౨౫–౧౩౫ నడుమ జన్మించినది. ఎఱ్ఱన రామాయణము కంటె భాస్కరరామాయణమే వయసునఁ గొంచెము పెద్దది. సాహిణిమారన క్రీ. శ. ౧౩౧౧ కు పూర్వమే చనిపోయినట్లు శాసనాధారము లున్నవి. ఈవిషయమునుగూర్చి హుళక్కి భాస్కరుని చారిత్రమున వ్రాసెదను. ఎఱ్ఱనరామాయణము మొదటిదని నిశ్చయించుటకై ప్రతాపరుద్రునికిఁ దరువాత హుళక్కిభాస్క

రుఁడు ముసలివాఁడుగా నున్నప్పుడు యుద్ధకాండమును రచియించెనని శ్రీ యాచార్యులవారు వ్రాసిరి గాని యవి యాధారరహితములైన యూహలు.

శ్రీ యాచార్యులవారు, వెంకటాద్రినాయని వ్రాసినపుస్తకములో నున్నదను కారణమున నంతొంత సత్యమున్నదియు విమర్శింపకుండ ఓరుగల్లుఁదొక దేవాలయములోఁ గూర్చుండి యామహాకవి (తిక్కనసోమయాజి) యీగ్రంథమును (మహాభారతమును) వ్రాసినట్లు భారతములోని "అనిపూని యాదృశంబులగు పుణ్యబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బగుటం జేసి" అను వచనము వలన స్పష్టమగుచున్నది. కావున మొదటి ప్రతాపరుద్రుని కాలమున భారతము తెనిగింపఁబడిన దనియుఁ దిక్కన పండ్రెండవ శతాబ్దమువాఁడనియు నెంచవలసియున్నది. ఇక తిక్కన తండ్రి పండ్రెండవశతాబ్దమధ్యమునందుండెననియు నతనితండ్రి యగుమంత్రి భాస్కరుఁడు పండ్రెండవశతాబ్దారంభమునను పదునొకండవశతాబ్దాంతమునను జీవించెననియు నూహింపవలసియున్నది." అని వ్రాసి యీ వాక్యములపై నాధారము చేసికొని రామాయణకర్త హుళక్కిభాస్కరుఁడని నిర్ణయించినారు. కాని యీ వాక్యములలోని యంశములు సత్యములని చరిత్రకారు లంగీకరింపరు. చరిత్రకు విరుద్ధములుగానున్న యీ యంశములను గూర్చి విశేషచర్చ చేయుట, అనవసరము. ఇట్టి యంశములమీఁద నాధారపడిన శ్రీ యాచార్యులవారి యూహలును యుక్తులును వాస్తవమునుఁ దెలిసికొనుటకుఁ దోడుపడవు.

### భాస్కరోదంతము:

కవిజీవితకారులగు శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులు గారును, ఆంధ్రకవులచరిత్ర ప్రథమ ముద్రణమున శ్రీ వీరేశలింగము

పత్రప్రతులు గ్రామములలో విశేషముగాఁ గలవు. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునందే దాదాపుగ నేఁబది ప్రతు లున్నవి. సాధ్యమయినన్ని ప్రతులను సంపాదించి పరిశోధించినచోఁ బ్రస్తుతమున జరిత్రకారులనుఁ బండితులనుఁ గలవరపెట్టుచున్న యనేక శంకలకు సమాధానములు లభింపఁ గలవని నా యాశ. నేనారంభించిన గ్రంథ సమాప్తికై పాటుపడుచుండుటచే నేనా కార్యమునకిప్పుడు పూనుకొన లేకపోయితిని. ఆ కార్యభారమును వహింపవలసినవారు చారిత్రాసక్తు లగు ధనాధికులును బండితులునై యున్నారు. భగవదనుగ్రహ ముండెనేని యాపరిశోధనభాగ్యము నాకుఁ గూడ లభింపవచ్చును. కాలక్రమమున నాపరిశోధనము జరిగి సత్యము బయలుపడుననియు నంతట మంత్రిభాస్కరునకు న్యాయము లభించుననియుఁ దలంచుచు నీతని చారిత్రమును ముగించుచున్నాఁడను.

పైని జేసిన చర్చనుబట్టి అయోధ్యారణ్య కాండములందు మంత్రిభాస్కరుని కవిత్వ మేదియో తెలిసినది. కావున నాతనిశైలి తెలియుటకై కాండమునకు నాల్గువంతున నెనిమిది పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను.

అయోధ్యాకాండము :

ఉ. బంధులు మంత్రులున్ భరతుఁ బట్టము రాముఁడు పెద్దవాఁడు స
ద్బంధుఁడు దోర్బలుండు గుణభాసియు నా సుతుఁడుండ నా సుతున్
సింధుపరీతధాత్రి కభిషిక్తునిఁ జేయునె భూవిభుం డసం
బంధము గానఁ దీనికి నుపాయ మెఱింగినఁ జెప్పుఁడుం ధరా. ౬౫

శా. స్వచ్ఛందస్థితిఁ గీర్తి దిక్తటములన్ వర్తింప నేకాతప ౨౩౪
త్రచ్ఛాయంబుగ భూమి నేలు రఘురత్నం బున్నచో ధర్మముం

ప్రచ్ఛాదించి కథుండు గూర్చె నని నిర్బంధించి యబ్బంగిఁ దు
శ్ఛేద్యంబైన వరంబు వేఁడె విధితో నవ్వాఁడు నేర్చెం గటా!

చ. తగణికుల ప్రభాఃబిరుదధ్వజపంక్తులఁ జూచి సేనతో
భరతుఁడు దాడి వెట్టి తమ్ముఁ బట్టఁగ వచ్చుటఁ గాఁ దలంచి ని
ష్ఠురగతి లక్ష్మణుండు ఘనచుంబిమహీరుహశాఖనుండి య
గ్గిరి యగలంగ డిగ్గనతికెం గుటిశాతతపాతమో యనన్. ౩౮౧

శా. అస్మత్కార్ముక ముక్తబాణవిసరం బాభీలదంభోళిసం
ఘస్మేరాగ్రము గాఁగ యుష్మదధిపేశ ప్రాతికూల్యంబు దా
నస్మాకం బటుగాక తక్కిన నయోధ్యాపట్టణం బంతయున్
భస్మీభూతము సేసి వృద్ధ మహీపాలాన్వయగ్రామణీ. ౧౮౧

ఆరణ్యకాండము :

మ. కరణీపుత్రిఁ బమోదపూరభరితాత్మం జేసి నానావిధా
ధ్వరసంగుల్ శరభంగుఁ జూచుటకుఁ జిత్తం బుత్సవం బొంద భా
స్కరవంశాగ్రణి యేఁగి కాంచె నచటన్ జంభారి రంభాది ని
ర్జరనారీకరచామరోద్భవ మరుత్పంచార లోలాలకున్. ౧-౮౨

మ. ఖరదైత్యాదిపుఁ డేయు బాణచయముల్ కాకుత్స్థ బాణౌఘముల్
సరినాకాశము నిండి తార్క్ష్యకులలం జండాగ్నికీలాసము
త్కర ముగ్రంబుగఁ జేయఁ దద్గతఘనధ్వానం బు బహ్మాండక
ర్పరమున్ దాఁకి తెరల్చె నాల్చె నురుతారామాత్రికశ్రేణులన్.

చ. అఱుగునె యక్కుగుండు గడు నంగద మ్రింగిన నూఁచి మూచినన్
విఱుగునె మేరుభూధరము వెంగలివై రఘురాముభామిని
గొఱగొని పోవఁ జూచెదవు చెచ్చెర నిప్పుడ యోరి నీచ నా
కిఱిచినబుద్ధి నైకొనుము కాచెద జానకిడించు మిమ్మహిన్. ౧౨౧

మ. శిరముం గంఠము లేక వక్షమునఁ బ్రస్ఫీతాంబకంబుల్ విశో
దర దేశంబున వక్త్రముం గలుగు సద్దైత్యాధమున్ శత్రుభీ
కరశాఖోగ్ర మదగ్రవిగ్రహరయుద్గర్వ గ్రహగ్రస్తు ను
ద్ధురమోహాంధుని గ్రౌర్యబంధునిఁ గబంధుం గాంచిరా రాఘవుల్.



# 19. కేతనప్రగ్గడ

పిదపాటి జగ్గన, తన ప్రబంధరత్నాకరమునందు భాస్కరుని కేతనకాదంబరిలోని దని యీక్రింది రెండు పద్యముల నుదాహరించి యున్నాఁడు.

సీ. దీనిలోపలఁ గొన్ని దినము లుండిన నుష్ణ
కరుఁడైన నట శీతకరుఁడు గాఁడె
దీని వెంజఱిగిన (గోతెత్తఁగిన) దా వంబురాశిలోఁ
గా దని జలశాయి కాఁపు రాఁడె
దీని తియ్యనినీరు దివిజులు త్రాగి చూ
చినఁ దమ యమృతంబు చేఁదు నాఁడె
దీనితోయము తలపై నల్కినంతనె (తోయమ్ముఁ దీర్థమాడినసెంత)
పాపాత్ములును మోక్షపరులు గారె (పదవిఁ గనరె)
యనుచు గొలనినీటి యతిశీలత్వంబు
బలుకుఁ బెంపుఁ దీపుఁ బావనతయుఁ
గడుమనంబుఁ బెంపఁగా వాఁడి బడివాఁగె
(ఘనజనాయకుండు గొనియాడి పడివాఁగె)

(తాఁటఁదిగిచికొనుచుఁ దటిరుఁ జొచ్చె.
(తాల్గట భాయముఁదిగిచి లెతిరుఁ జొచ్చె)

శా. గంధర్వాత్మజ రాజుఁ జూచెఁ బతియుం గాదంబరిం జూచెఁ ద
ద్గాంధీభూతమనస్కుఁడై మరుఁడు విల్లందెన్ బ్రసూనోల్లస
ద్గంధం బొప్పఁగ నెక్కుపెట్టి గుణనాదం బాసి పుష్పాస్త్రముల్
సంధించెన్ దెగఁబాపి యేయఁదొడఁగెన్ సవ్యాపసవ్యంబుగన్

కస్తూరిరంగకవి తన రంగరాట్ఛందమునందుఁ గేతన కాదంబరి లోని వని ప్రాదియతికి లక్ష్యముగా నొక గీతపద్యమును, నభేదయతికి లక్ష్యముగా నొక శార్దూలవృత్తపాదము నిచ్చియున్నాఁడు. అవి యివి:

గీ. జనవరేణ్యుఁ గాంచి సాష్టాంగ మెఱఁగిన
వానిభుండు వాని లేవనెత్తి
కౌఁగిలించి వానిఁ గనుఁగొని కేయూర
కాభిదాన మొసఁగెఁ గౌతుకమున.

శా. డాచే యంకతలంబుఁ జేర్చి వలచేతన్ మూలికన్ దాల్చి.

“బాణోచ్ఛిష్టం జగత్రయ”మ్మని కీర్తిఁగాంచిన బాణభట్టమహాకవి సంస్కృతమున “కాదంబరి” యను మహాకావ్యమును రచించియుండెను. దాని నీతఁ డాంధ్రమునఁ బద్యకావ్యముగా రచియించెనని తెలంపవలసియున్నది. కేతననామధారులు కవులు మూలఘటిక కేతన, నందూరి కేతన మొదలుగాఁ గొందఱున్నారు. కాని వారెవ్వరును భాస్కరుని తనయులు కారు.

తిక్కనసోమయాజి వంశమునఁ దిక్కనకుఁ బూర్వులు భాస్కరుని కేతన లిరువురున్నారు. వారిరువురను తాతయు మనుమఁడును. దశకుమార చరిత్రమున, వీరిరువురిలోఁ దాతయైన కేతనను గవియని

చెప్పియున్నాఁడు. కావున నా కేతనయే కావ్యకర్తయని నిశ్చ యింపవలసియున్నది. దశకుమార చరిత్రమున నీకేతనను వర్ణించిన పద్యముల నీక్రింద నిచ్చుచున్నాఁడను,

ఉ. దీధి భాస్కరార్యునకు ధీరగుణాన్విత కొమ్మమాంబకున్
మానవకోటి లోపల సమస్తగుణమ్ములవాఁడు పెద్ద నా
వానికి వాఁడు పెద్దయిన వానికి వానికి వాఁడు పెద్ద నా
వానికి వారలిద్దఱకు వాఁ డధికుండనఁ బుట్టె రాత్మజుల్.

సీ. వివిధవిద్యాకేళి భవనభావంబున
జలజాముఖచతుష్టయముఁ బోలి
వివిధవిప్రతిపత్తివినతక్రీడను
జలశాయి భుజచతుష్టయముఁ బోలి
ధర్మమార్గక్రియాదర్శకత్వంబున
సన్నాగమచతుష్టయముఁ బోలి
పృథుతరప్రథితగాంభీర్యగుణంబున
శంబరాకరచతుష్టయముఁ బోలి
సుతచతుష్టయంబు దనరె నెక్కుగుణనిధి
కేతనయును బారిజాతనిభుఁడు
మల్లనయును మంత్రిమణి సిద్ధనయు రూప
కుసుమమార్గణుఁడు కొమ్మనయును.

వ. అందగ్రనందనుండు.

చ. కవితకు మెచ్చి యీఁ దగు బహూకృతవస్తువు లిచ్చువాఁడు నా
నవరసభావుకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండు నా
నవు నన రాజనీతివిషయజ్ఞుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రి యిమ్మహిన్.

ఇందు మొదటిపద్యములోఁ జెప్పఁబడిన భాస్కరుఁడే భాస్కర రామాయణకర్తయని యూహింపఁబడిన యాతఁడు. అతని చారిత్రము నింతకుముందు వ్రాసియుంటిని. అతనికుమారులు నలువురిలో పెద్దవాఁడైన కేతనయే కాదంబరీకర్తయని చెప్పబడిన యాతని మూఁడవ కుమారుఁడైన సిద్ధన, చోడతిక్కరాజునకు మంత్రి. ఈతనిఁ గూర్చి తిక్కసోమయాజి చరిత్రమున వ్రాయుచున్నాఁడను. నాల్గవకుమారుఁడైన కొమ్మన తిక్కనసోమయాజి తండ్రి.

కాదంబరీకృతికర్తయైన కేతనకుమారుఁడు భాస్కరుఁడు ఈ భాస్కరునకు కిరువురు కుమారులు. అందు పెద్దవాఁడు కేతన ఇతనినే మనుమఁడు కేతన యని పైన వ్రాసియుంటిని. ఇతఁడు కవియైనట్లు దశకుమారచరిత్రకర్తయైన మూలఘుటిక కేతనంవి చెప్పియుండలేదు. ఈవిషయములను దెలుపు పద్యములను గూడ నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఉ. మానిని బ్రహ్మమాంబకు సమగ్రయశోమణి కేతనాంకకున్
భూనుతకీర్తి భాస్కరుఁడు పుణ్యచరిత్రుఁడు మంత్రిగుండఁడున్
ధీనిధి వల్లసిద్ధియు నతిస్థిరచిత్తులు ధర్మతత్పరుల్
మానవనాథ పూజ్యులు క్రమంబునఁ బుట్టిరి కీర్తనీయులై

వ. అందగ్రజుండు

క. నీతిసురాచార్యుఁ డన
దాతృతఁ గానీనుఁ డనఁ బ్రతాపంబునఁ బ్ర
ద్యోతనుఁ డన సచివాగ్రణి
కేతయభాస్కరుఁడు జగతిఁ గీర్తనకెక్కెన్

చ. గొనముఁ బ్రోడ భాస్కరునకున్ బతిదేవత మారమాంబకున్
దినకరతేజులై తుహినదీధితిసన్నిభకాంతిమంతులై
వనధిగభీరులై సుజనవందితులై జనియించి రొప్పుగా
ఘనుఁ డచతుండు కేతనయు మారపమాన్యుఁడు మాంచిరాజయున్

క. శౌచంబున గంగాత్మజుఁ
డాచారంబున మరీచి యర్థుల కిరీ
ఖేచరవల్లభుఁ డనఁగాఁ
బాచయకేతనుఁడు కీర్తిపాత్రం బయ్యెన్.

తాతయైన కేతనను గవియని చెప్పియుండుటచేతను, మనుమని కవిగా వర్ణింపకపోవుటచేతను, తాతకేతనయే కాదంబరీకర్త యని నిశ్చయింపఁ దగియున్నది. చోడతిక్కరాజు కాలము శా. శ. ౧౧౧౦-౧౧౮౫ అయియున్నది. అతనియొక్క మంత్రిగనున్న సిద్ధన యీ కేతన ప్రెగ్గడకుఁ దమ్ముఁడు. కావున నీకేతన ప్రెగ్గడయు నాకాలమునం దున్నవాఁడని నిశ్చయింపవచ్చును. అనఁగా క్రీస్తుశకము పదుమూఁడవ శతాబ్ది ప్రథమార్ధమున నున్నవాఁడని యర్థము.

ప్రబంధరత్నాకరమునందు కేతన కువలయాశ్వ చరిత్రములోని దని యీక్రిందిపద్య ముదాహృత మగునది.

ఉ. కోట తెసర్పుచూడ్కుల కగోచర మయ్యెనుఁ దేరుమీఁద బి
ల్లాటున నేఁగుచోట దగులంబడమిన్ రవిమండలంబు నీ
పాటిదనేల తెల్పఁగనుఁ బెట్టుచున్నది గాక దీనికిం
గాటి యనంగ గుజ్జనఁగఁ గట్టెనె యయ్యెడ యాస్తశైలముల్.

ఈకేతన, యెవ్వరో తెలిసికొనుటకుఁ దగిన యాధారములు దొరకలేదు. మూలఘటిక కేతన కాఁడు. నందూరికేతన యైన నై యుండవచ్చును. లేదా మఱియెవ్వఁడైనఁ గావచ్చును.

ఆంధ్రపద్యకాదంబరి యిప్పుడెచ్చటను గాన్పించుటలేదు. ఉదాహృత పద్యములనుబట్టి యీప్రబంధమునందలి శైలి ప్రౌఢముగను, రసవంతముగను మనోహరముగను నుండునట్లు తోఁచుచున్నది. ఇట్టి యుత్తమ ప్రబంధము నామమాత్రావశేష మగుట యాంధ్రుల దురదృష్టము. ఆఱువందల సంవత్సరములకుఁ బూర్వము రచింపఁబడిన యీగ్రంథ మెచటియో యదృష్టముండినఁగాని బయటపడునను నాశ లేదు.

—•—

# 20. తిక్కన సోమయాజి

ఈకవిబ్రహ్మ, ఈ యుభయకవిమిత్రుఁడు, ఈపండితశిరోమణి ఈకవిపండిత పోషకుఁడు, ఈ సాధరీకృతకల్పభూరుహుఁడు, ఈ నిరంతాగ్నిహోత్రి, ఈ రాజనీతిదాగణ్యుఁడు, ఈ మహాభారతనిర్మాత, ఈ మహాసౌందర్యరాశి ఆఱువేల నియోగిబ్రాహ్మణ కుటుంబమున గౌతమ గోత్రమునఁ గొమ్మనమంత్రినాథునకును, అన్నమాంబకును నొక శుభముహూర్తమున జన్మమందెను. ఈతనికి మంత్రిభాస్కరుఁడు పితామహుఁడు; కొమ్మమాంబ పితామహి. ఈతని వంశవృక్షము ఇందు నిచ్చుచున్నాను.

## ఇతని పూర్వుల ప్రశంస:

మూలఘటిక కేతనకవి కృతిమగు దశకుమార చరిత్రమునందలి పద్యము లీవంశవృక్షమున కాధారములు. ఈవంశమిప్పటికిని దామరతంపరయై యభివృద్ధి నందుచున్నదని తెలియుచున్నది.

ఒకానొక శాసనమున (A. R. నెం. 290 రు. 1932 33) మాచెన యను నాతండు వస్తువులపైఁ బన్నును రాబట్టెడి యధికారిగా నుండి యీయన్నను గుంటూరు మండలములోని సత్తెనపల్లి తాలూకా మాచెందల (మాడాల)లో నున్న సకలేశ్వర దేవునకు దీపమునకై శాక ౧౦౫౧ వ సంవత్సరమున ధారవోసినట్లు వ్రాసియున్నది. ఆ మాచెన పై వంశవృక్షమందలి మాచపురుషుఁడేమో పరిశోధింపవలసి యున్నది. కాని యందులకడ్డము రాదు. తిక్కనవంశకర్తయైన మాచెనను మూలఘటిక కేతనకవి తన దశకుమార చరిత్రమున నిట్లు వర్ణించి యున్నాడు.

క. ఆగౌతమగోత్రమునను
దాగ్రవతిశీలుఁ డమలినాచారుఁడు నా
నాగుణమండితయశుఁ
డాగమకోవిదుఁడు మాచనార్యుఁడు పుట్టెన్

పైని జెప్పిన శాసనమిది. "శకవర్షంబులు ౧౦౫౧ గుశ్రాహి సూర్యగ్రహణ మాచెన శ్రీసకలేశ్వరదేవర ఖండవర్తి దీపంబునకు మాచ్చెందల

## తిక్కనసోమయాజి వంశవృక్షము

- మారెన
  - గుంటూరి
    - కేతన = భార్య నాచమ్మ
      - గుండన
      - భాస్కరమంత్రి = భార్య కొమ్మమాంబ
        - కేతన ప్రగ్గడ = భార్య బ్రహ్మమాంబ
          - భాస్కరుడు = భార్య కామమాంబ.
            - కేతన
            - మారన
          - గుండన = భార్య మాదేవి.
            - మల్లన
            - కొమ్మన
            - సిద్ధన్న
            - కేతన్న
          - మల్లిసిద్ధి = భార్య అక్కమ.
            - కేతన
            - మల్లన = భార్య కాచమ్మ
              - మనుమసిద్ధి
        - మల్లన
        - సిద్ధన = భార్య పోలాంబ. (ఇతఁడు తిక్కరాజునకు మంత్రి)
        - కొమ్మన = భార్య అన్నమాంబ
          - తిక్కనసోమయాజి (భారత గ్రంథకర్త)
      - మహేశ్వరుడు




సిద్ధన  కొమ్మన  ఇమ్మడిమనుమసిద్ధి  ముమ్మడిమనుమసిద్ధి

కోటపీఠా మూడవ్రాక్రము గా నిచ్చె" (ఈశాసనము ప్రతిని నేఁడు గగనే వ్రాసియుంచినందులకు ఉదకమండలమునందున్న దొరతనము వారి యెపిగ్రాఫిస్టుగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను)

ఈ మూడవ మనుమఁడైన కేతన కమ్మనాఁటిని పాలించిన త్రిభువనమల్లదేవచోడుని మంత్రియనియు నా కేతన మనుమలైన కేతన మల్లన లిక్కమ్మనాఁటి చోడులకు మంత్రులుగా నుండిరనియుఁ దెలియుచున్నదని బ్ర. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు (ఆంధ్రుల చరిత్ర ౮౨-౮౩ పుటలు) వ్రాసియున్నారు. కాని యందు సత్యము లేదు. ఈ త్రిభువనమల్లదేవచోడుఁడు క్రీ.శ. ౧౧౨౦ ప్రాంతమువాఁడు. ఇతని పేరున శాసనము లనేకములున్నవి. ఆతనికడ మంత్రులుగా నున్నవారు కాశ్యపగోత్రులు. అందు కేతన శివదేవునికొడుకు. కేతన, మల్లనలు అమాత్యసిద్ధనామాంబల తనయులు (ద. హిం. శా. సం. ౬ సంఖ్య ౧౩౨:౬౮౩) తిక్కనసోమయాజి వంశీయులకును వారికిని నేమియు సంబంధము లేదు.

పై వంశవృక్షమునఁ దిక్కనసోమయాజికిఁ బితామహుఁడుగాఁ గన్పట్టుచున్న భాస్కరమంత్రియే భాస్కరరామాయణకర్త యని యూహింపఁబడుచున్న యాతఁడు. అతని చారిత్రము నీగ్రంథమున వేఱుగ వ్రాసియున్నాఁడను. ఆ భాస్కరమంత్రి పెద్దకుమారుఁడును దిక్కనసోమయాజికిఁ బినతండ్రియునగు కేతనప్రగ్గడయే ఆంధ్రపద్యకాదంబరీ కావ్యకర్త యని తలంచుచున్నారు. ఆ కవిచారిత్రమును గూడ నిందు వేఱుగ వ్రాసియుంటిని.

తిక్కనకు వేఱొక పెదతండ్రియగు సిద్ధనయు నాతనికుమారుఁడైన తిక్కన (ఖడ్గతిక్కన) యుఁ జోడతిక్కరాజునకు మంత్రులై సేనాధిపతులై పరాక్రమవంతులై యనేకరణములలోఁ బాల్గొని శాశ్వతకీర్తిని గడించియున్నారు. చోడతిక్కరాజెవ్వరో తెలిసినఁగాని వారిని గూర్చి చెప్పిన ప్రయోజనములేదు. కావున వారి వృత్తాంతమును దరువాత వ్రాసెదను.

ఈ ఖడ్గతిక్కనకు సోదరులైన కేసన, మల్లన, భాస్కరులు పరాక్రమవంతులును శూరులు నైనట్లు క్రిందిపద్యములలోఁ గేతనకవి దశకుమారచరిత్రమునఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆసని నీతిసంపద విహంగమపుంగవకేతుఁ జెప్పుచోఁ
గేతనఁ జెప్పి యుద్ధవిజిగీషను వానరకేతుఁ జెప్పుచోఁ
గేతనఁజెప్పి దిగ్విదితకీర్తిరతున్ వృషకేతుఁ జెప్పుచోఁ
గేతనఁజెప్పి కాక ధరఁ గేవలమర్త్యులఁ జెప్పఁజాలునే.

శా. పారావారపరీతధాత్రి వినుతింపం బోలు మల్లాంకునిన్
సారోదార యశోభిరాము విహితాస్త్రప్రౌఢు శస్త్రాస్త్రవి
ద్యారాజత్పటుబాహుని క్షమను దాత్తస్వాంతు ధర్మైకయా
చారాపాస్తసమస్తదోషనివహున్ శౌర్యోత్తునారాయణున్.

చ. ఉరవడి నగ్గి సేవణపయోధి బాడబవహ్ని చాళుక్యుఁడన్
దరికొని కుంభజన్మక్రియఁ ద్రాగి రఘుక్షితినాథు మాడ్కి న
ర్చ్యాగపుగ నింకఁ జేసె నని చెప్పఁ జనప్రకరంబు విక్రమా
చరణుని సిద్ధనార్యసుతు గాచని సన్నుతగంధవారణుఁడా.

ఈ పద్యమునఁ జెప్పిన సేవణరాజు లనఁగా దేవగిరి రాజధానిగా రాజ్యమేలిన యాదవరాజులని చరిత్రకారులు నిర్ణయించి యున్నారు. ఈ సేవణరాజులను జోడతిక్కరాజు జయించినట్లు దశకుమారచరిత్రమునందుఁ దిక్కరాజును వర్ణించుసందర్భమునఁ గేతనకవి రచించిన "సేవణ కటక సామంతు గర్వ మడఁచె" అను వాక్యపాదమువలన దెలియుచున్నది. పై చంపకమాలలోని భాస్కరుఁడు మంత్రిభాస్కరునకుఁ బౌత్రుఁడు. తిక్కనసోమయాజికిఁ బెదతండ్రి కుమారుఁడు, ఇతఁడు కూడ గండ్రశిలెకు, సోదరుఁడగు ఖడ్గతిక్కనవలెనుఁ జోడతిక్కరాజునకుఁ సేనాధిపతిగా నుండి సేవణరాజులతోఁ నాతనికి జరిగిన యుద్ధములలోఁ బాల్గొని జయముఁ గాంచి యుండును.

తిక్కనసోమయాజితండ్రియైన కొమ్మనామాత్యునిఁ దల్లియైన యన్నమాంబను, దశకుమారచరిత్రమునఁ గేతనకవి యీక్రింది పద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. స్వారాజ్యపూజ్యుఁడో కౌరవాధీశుఁడో
నాఁగ భోగమున మానమున నెగడె
రతినాథుఁడో శివరాజతనూజుఁడో
నాఁగ రూపమున దానమున నెగడె
ధరణీధరేంద్రుఁడో ధర్మసంజాతుఁడో
యనఁగ ధైర్యమున సత్యమున నెగడె
గంగాత్మజన్ముఁడో గాండీవధన్వుఁడో
యనఁగ శౌచమున శౌర్యమున నెగడె

సూర్యవంశభూపాల సుచిరరాజ్య
వనవసంతుండు బుధలోకవత్సలుండు
గౌతమాన్వయాంభోనిధి శీతకరుఁడు
కులనిధానంబు కొట్టరు కొమ్మశౌరి.

సీ. పతిభక్తి నలయరుంధతి బోలె నేనియు
సౌభాగ్యమహిమ నిసతికి గానదొ
సౌభాగ్యమున రతిఁ బరియాడ్య నేని
భాగ్యంబున నీయంబుజాక్షి గానదొ
భాగ్యంబునందు శ్రీ ప్రతి యనఁ న్యానేనియుఁ
దాలిమి నిలతాతిక్వ గానదొ
తాలిమి భూదేవి తగఁ బోలియగు నేని,
నేర్పున శివశ్మనిత గానదొ
యని యనేకవిధంబుల నఖిలజనులు
పొగడ నెగడె కృపాపరిపూరితాంత
రంగ కొమ్మనామాత్య నర్ధాంగలక్ష్మి
యఖిలగుణగణాలంకృత యన్నమాంబ.

తిక్కనసోమయాజి తండ్రియగు కొమ్మనామాత్యుఁడు, దండనాథుఁడనియుఁ గుంటూరు విభుఁడనియు భారతమునఁ జెప్పియున్నాఁడు. గుంటూరి విభుఁడనఁగా గుంటూరునకుఁ గరణమనియు తిక్కనసోమయాజి కుమారుఁడు కూడ గ్రామకరణముగా నుండెను. కావున వీరు మొదటినుండియు గ్రామకరణములుగా నుండిరనియుఁ గొందఱి యభిప్రాయము. సుప్రసిద్ధ చరిత్రకారులగు శ్రీ. చి. వీరభద్రరావు పంతులుగారీ యభిప్రాయము సరికాదనిరి, కొమ్మన కరణమైన నగుఁగాక. ఆయన నాకాలమునాఁటి కరణము లిప్పటివారివలె

లెక్కలు వ్రాయువారుగా మాత్రమేయుండి పేరుప్రతిష్ఠలు లేనివారుగా నుండెడివారని తలంపరాదు. ఆకాలపు కరణములు, శాస్త్రజ్ఞాన సంపన్నులై పరాక్రమవంతులై యున్నతగౌరవము కలవారై తమ గ్రామ సంరక్షణమునకుఁ గావలసిన సైన్యము నుంచుకొని రాజునకు సర్వవిధముల సాహాయ్య మొనర్చుచు రాజుచే గౌరవము నందుచుండెడివారు. అందుచేతనే "విభు" "మహీపాలక" శబ్దములు, వారియందు వర్తించుచుండెను. తిక్కనసోమయాజితండ్రి గ్రామకరణమని యంగీకరించినను, నంతమాత్రమున వానిని సామాన్యునిగాఁ దలంపగాదు. ఇతఁడు సాంగవేదవేది. గండాధిపతి సూర్యవంశ భూపాల సుచిరరాజ్య వనవసంతుఁడై గాండీవధన్విసమాన శౌర్యమున నెగడియున్నాఁడని కేతనకవి చెప్పియుండుటచే వీనిని కేవల మొకవ్రాయసగాఁడని తలంపరాదు. ఇతఁడు మూఁడవ చోళరాజులకు సేనాధిపతిగా నుండి నెల్లూరునందు జరిగిన యొక మహారణములో వీరమరణము నందెననియు, నావార్త గుంటూరునం దున్న యాతనిభార్య విని యించుకేనియు విచారము నందక తాను వీరపత్ని యైనందులకు సంతసించి భర్తతో సహగమనము గావించెననియుఁ జెప్పుదురు. భర్తమరణవార్త చెప్పవచ్చినవారితోడను నాసమయమునఁ దనను జూడవచ్చినవారితోడను దేహ మశాశ్వతమనియు, జీవితమునఁ బరోపకారకముగాఁ గడపుటయు, వీరమరణము నొందుటయు నుత్తమపురుషలక్షణము లనియు నట్టి భర్తతో సహగమన మొనరించుట నుత్తమసాధ్వీధర్మమనియు హితోపదేశము గావించెనఁట. ఈదంపతుల సుగుణములను తెలుపుకథలను ప్రజలు విశేషముగా నిప్పుడునుఁ జెప్పుకొనుచుందురఁట.

జగద్విఖ్యాత చారిత్రుఁడైన తిక్కనసోమయాజి శ్రీపుణ్యదంపతులు తలిదండ్రులు. మొత్తము మీఁద నీకుటుంబమున మొదటినుండియు పండితులును-గవులును, శూరులును, దాతలు నుద్భవించి తమ యశ

చంద్రికల దిగంతముల వ్యాపింపఁజేసియుండిరని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈకుటుంబమువారు, నెల్లూరు రాజధానిగా నాచుట్టుపట్టుల నున్న దేశమును బరిపాలించిన చోడరాజులకడ మంత్రులుగను సేనాధిపతులుగ నుండి పేరువడసిరని చెప్పుట కీవంశమునందలి పేరులు సాక్ష్యమిచ్చుచున్నవి. ఆకాలమున మంత్రులు, సేనాధిపతులు మొదలగు రాజకీయోద్యోగులు తమ సంతానమునకుఁ దమ ప్రభువుల నామములనుంచి తమకృతజ్ఞతను వెల్లడించు నాచార ముండెడిది. తిక్కన రచించిన నిర్వచనోత్తరరామాయణమునకుఁ గృతినందిన ప్రభువు మనుమసిద్ధి. ఆతనితండ్రి తిక్కరాజు. ఆతనితండ్రి మనుమసిద్ధి. ఆతని పూర్వుఁడు బల్లసిద్ధి. ఈ పేరు లీవంశవృక్షమునఁ గాన్పించుచున్నవి. మన చారిత్రకపురుషుఁడైన తిక్కనపేరు, మనుమసిద్ధి తండ్రియైన తిక్కరాజునుఁబట్టియే వచ్చినదని తలంపవచ్చును. కాళహస్తి యందున్న తిరుకాళత్తిదేవుఁడే యాంధ్రమునఁ దిక్కన యైనాఁడు. చోడతిక్కరాజునుఁ దిరుకాళత్తిదేవచోడుఁడని కూడ పిలచెదరు.

ఇట్టి సుప్రసిద్ధవంశమునఁ దిక్కనసోమయాజి జననమంది మహాకవి యగుటయేగాక గొప్ప రాజకీయవేత్తయై మహోదాత్తుఁడై వేదవేదాంగసంపన్నుఁడై కర్మిష్ఠుఁడై కవిపండిత పోషకుఁడై క్రతుపతియై శాశ్వతకీర్తిని గడించియున్నాఁడు.

కొట్టరువు కొమ్మనప్రగ్గడ కొడుకు మల్లనప్రగ్గడ యనువాఁడు విశ్వేశ్వరశివదేశికుని (కాకతీయగణపతిదేవునకు రాజగురువు) యొద్ద ధాన్యాధిపతిగనుండి శా. శ. ౧౨౦౮ చిత్రభాను సం॥ర ఆశ్వయుజ బహుళ తృతీయనాఁడు విశ్వనాథదేవునకు దీపమునకై యేఁబదిగొఱ్ఱెల నిచ్చినట్లు గుంటూరు మండలములోని నంవరగ్రామమున నొకశాసన మున్నది. (A. R. నెం. 98 రు. 1917) పై వంశవృక్షములోఁ

గొమ్మన కొడుకు మల్లన కనుపడుటలేదు. కాని దాని తుదిగొమ్మల యం దిరువురు కొమ్మనలున్నారు. వారిలో నెవరికైన మల్లన యుద్భవించినాఁడేమో! లేక యాతఁడు మఱియొక వంశమువాఁడో! శాసనములో నాతఁడు భారద్వాజగోత్రుఁడని యున్నది. తిక్కనసోమయాజి గౌతమగోత్రుఁడు. శాసనములోని వ్రాఁత పొరపాటు కావలయును. లేదా కొట్టరువువారిలో రెండుగోత్రములవా రుండి యుండవలయును.

తిక్కనసోమయాజి తన్నుఁగూర్చి చెప్పినవిషయములు:

ఈమహాకవి రచించిన గ్రంథములయందుఁ దనను గూర్చి యేమి వ్రాసికొని యుండెనో చూతము.

ఇతఁడు నిర్వచనోత్తర రామాయణమును శ్రీమహాభారతమున విరాటపర్వమాదిగాఁ గడపటివఱకు బదునైదు పర్వములను నాంధ్రమున బద్యకావ్యములుగా రచించి యుండెను. నిర్వచనోత్తర రామాయణమున నితఁడు తనుఁగూర్చి యీయొక పద్యమును మాత్రమే చెప్పికొని యున్నాఁడు.

మ. అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమగోత్రుండ మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మనమంత్రికిన్ సుతుఁడ దిక్కాంకుండ సద్వర్ణ్యుఁడన్.

ఈ పద్యమునందుఁ దాను శివభక్తుఁడ నైనట్లు చెప్పికొన్నను వైష్ణవద్వేషమున్నవాఁడు కాఁడని నిర్వచనోత్తరరామాయణ రచనము వలనను నందలి ప్రథమపద్యమునందె "హరిహరపద్మగర్భులను" అని చెప్పియుండుటచేతను స్పష్టమగుచున్నది. మఱియు సంస్కృతాంధ్ర కావ్యకల్పమునందుఁ బారగుఁడ ననియుఁ గళావిదుఁడననియుఁ జెప్ప

కొని యుండుటచే నదివఱకేవియో కొన్ని సంస్కృతాంధ్రగ్రంథములను రచియించి యున్నట్లు పొడకట్టుచున్నది. కాని యీ రామాయణ భారతములు దక్క నితర గ్రంథములును నీతనిరచనములు మనకు లభ్యములగుట లేదు. తిక్కనసోమయాజికి దశకుమార చరిత్రమునుఁ గృతియిచ్చిన కేతనకవి:

క. అభిమతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయ కవిమిత్రనాముఁడు
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్

అని చెప్పియుండుటచే నీతఁ డనేక సంస్కృతాంధ్ర గ్రంథములను రచియించినట్లు తెలియుచున్నది. కేతనకవి చెప్పియుండకపోవుటచే నీమహాకవి రచనముల పేరులైనను తెలిసికొను నదృష్టము లేకపోయినది. ఆ కాలమువారికి, తాముదివఱకు రచించిన గ్రంథముల పేరులను గాని తమపూర్వులు రచించిన కావ్యముల పేరులు గాని చెప్పుకొను నాచారము లేదు. తిక్కనసోమయాజికూడ తనతాతనుఁగూర్చి చెప్పునప్పుడు "సారకవితాభిరాము" అని చెప్పెనే గాని యాతఁడురచించిన గ్రంథములనుఁ బేర్కొనలేదు.

సంగమవంశజుఁడైన కంపరాజుభార్య గంగాదేవి తనభర్తృవిజయములను వర్ణించుచు వ్రాసిన మధురావిజయమను సంస్కృతగ్రంథమున దిక్కనసోమయాజిని సంస్కృతకవులలోఁ జేర్చి వర్ణించినది. కాని యందునను నాతఁడు రచించిన గ్రంథనామముల నీయలేదు.

ఈ మహాకవి, భారతములోఁ గూడఁ దననుఁగూర్చియుఁ దన పూర్వులనుఁగూర్చియు నొక్కపద్యమే వ్రాసికొనినాఁడు.

సీ. సజ్జనవంద్యుండు సన్మాన్యగౌతమగోత్ర
మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘులు కేతన
మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ
మ్మనదండనాథుఁడు మధురకీర్తి
విస్తారస్ఫూర్తిఁ డాపస్తంబసూత్రప
విత్రశీలుఁడు సాంగవేదవేది

తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మెసఁగఁ బల్కి
నస్మదీయ ప్రణామంబు లాదరించి
తుష్టి దీపించి కరుణార్ద్రదృష్టిఁ జూచి
యొలసి నిట్లని యానతి యిచ్చె నాకు.

తిక్కన, తనను గూర్చిగాని, తన పూర్వులను గూర్చిగాని యీ గ్రంథమునందు విశేషముగాఁ జెప్పుకొనకుండుట యాత్మశ్లాఘనమువం టిష్టము లేకపోవుటయో, పూర్వగ్రంథములయందు వర్ణించియుండి మరల మరలఁ జెప్పుకొనుట రుచింపకయో యైయుండును. ఇప్పటివారికి లెక్క గాక యానాటి మహాకవులకు, స్వవిషయకథనమునం దిష్టముండెడిది కాదు. నన్నయభట్టు తండ్రిపేరైనను గృహనామమునైనను జెప్పుకొనలేదు.

ఇతని గృహనామము: నివాసము:

తిక్కన తన గృహనామము నెప్పుడును జెప్పుకొని యుండలేదు. కేతనకవి రచించిన దశకుమారచరిత్రమువలన వీరియింటిపేరు కొట్టరువువారని తెలియఁగనగుచున్నది. మొట్టమొదట వీరి గృహనామము గుంటూరువారనియుఁ బిమ్మట కొట్టరువుగా మారెననియు నందురు. తిక్కన పూర్వుల నివాసము గుంటూరుమండలమునందలి

పడుగుపాడనియుఁ గొన్ని తరములయిన పిమ్మట గుంటూరునకువచ్చి యచ్చట నివాసమేర్పరచుకొనిరనియుఁ దిక్కన పితామహుని జీవితకాలమునందో, కాక యాతని తండ్రులకాలముననో నెల్లూరునకు వచ్చి యట నివాసమేర్పరచుకొని రనియు జెప్పుచున్నారు. తిక్కన నెల్లూరు నివాసి యనుట నిర్వివాద విషయము. తండ్రిని గుంటూరు విభుఁడనుటచేత తండ్రినివాసము గుంటూరనియే చెప్పవలెను.

కొన్ని శాసనములలో కోష్ఠాధిపతి యను సంస్కృత శబ్దమునకు దెలుఁగున కొట్టారువు అని వ్రాసియున్నారు. ఇట్లే భాండాగారాధిపతులకు భండారువు అని యుపయోగించియున్నారు. తిక్కనవంశీయులలోఁ బూర్వ రాజులయొద్దనో కోష్ఠాధిపతులై యుండిరనియు నాకాలపు తెలుగుభాషనుఁబట్టి వారిని కొట్టారువు లని వాడియుండిరనియు దాని ననుసరించి యావంశీయులకు "కొట్టరువు" అను నింటిపేరు వచ్చియుండునని యూహింపఁదగి యున్నది. ఈపే రెప్పుడు వచ్చెనో చెప్పుట కాధారములు లేవు.

కొట్టరువు అన నొక గ్రామ ముండెననియు దానినిబట్టి వీరి గృహనామ మేర్పడెననియుఁ గొందఱనుచున్నారు. కాని యది సత్యము కాదు. కొట్టరువుగ్రామ మెచ్చటనుండెనో వారు చెప్పలేదు. గుంటూరు నెల్లూరు మండలములలో కొట్టరువు లేదు.

దశకుమారచరిత్రమందలి తిక్కన ప్రశంస:

తిక్కనసోమయాజి, మూలఘటిక కేతనకవి రచించిన దశకుమార చరిత్రముఁ గృతినందెను. అందుఁ దిక్కనగూర్చి యాకేతనకవి రచించిన పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁడనిన
వీఁ డనునాలుకకుఁ దోడవైనవాఁడు

మహితశక్తిగలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వ్యసనము దారి
పరుని కొక్కని కిచ్చి యుం బ్రాకటవృత్తి
నిజముగా నెంచు సాంసార నెగడునట్టి
కొమ్మనామాత్య తిక్కన కొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు?

ఇతఁడు కేవల మంత్రియే గాక దండాధీశుఁడు కూడ నైనట్లు కేతన రచించిన యీక్రింది పద్యముల వలన స్పష్టమగు చున్నది.

క. శ్రీకరవరకవనదూ
రీకరణనోద శుభచరిత్రుని ననుకం
పాకరహృదయుఁ గులాబ్ధిసు
ధాకరు శుభమూర్తిఁ దిక్కదండాధీశున్.

క. శ్రీవిలసద రమణీయా
భావిభవపాదపద్మ భావనిభావా
భూవినుత శుభచరిత్రా
ధీవిభవాత్తస్వరూప తిక్కచమూపా.

కేతనకవి రచించిన యీపద్యములం దతిశయోక్తి గాని యుత్ప్రేక్ష గాని లేవని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుఁడగు నీమహామహుఁడు తనవంశమున రాఁబోవువారల కైశ్వర్యమును సంపాదించి నిలువయుంచవలయు నను కోరికగలవాఁడు కాఁడనుట కితని కుమారుఁడొక చిన్న గ్రామమునకుఁ గరణమైయుండెనను టయే నిదర్శనము. ఇతఁడు తన శక్తినంతయును ప్రభుకార్యనిర్వహణము నందు వినియోగించి చోడరాజ్యస్థాపనాచార్యుఁడయ్యెను. తన పాండిత్యమును లోకశ్రేయమునకును, ఆంధ్రసాహిత్యాభివృద్ధికి నుప

రోగపరచి, యుద్గ్రంథరచనమును గావించుటయేగాక యనేకవులకుఁ బండితులకుఁ బ్రోత్సాహ మొసంగియున్నవాఁడు మారనవంటి మహాకవి యీతనికి శిష్యుఁడగుటయు కేతనవంటి పండితకవి కృతిదాత గావుటయు, బద్దెనవంటివాఁ డీతనిచే బిరుదమును గ్రహించుటయు నిదర్శకుఁ దార్కాణములు.

## హరిహరనాథుని ప్రశంస.

ఇతఁడు పరమ భక్తాగ్రేసరుఁడనుట కీతని రచనములే దృష్టాంతములు. ఇతనికాలమున వీరశైవవైష్ణవమతములు పరస్పర ద్వేషముతో నుండి యన్యోన్యహింసకూడ గావించుకొను స్వభావముతో మెలఁగుచు వచ్చినవి. అట్టిసమయమున నీమహాపురుషుఁడు శివకేశవుల కభేదమును ప్రతిపాదించి, హరిహరనాథుఁడను దైవమునకు తనభారతమును గృతియిచ్చెను. నెల్లూరునందు హరిహరనాథ దేవాలయము ముండెడిదనియు, తిక్కనసోమయాజి భారతము నాయాలయమునఁ బవిత్రహృదయముతోఁ గూర్చుండి రచియించెననియు జెప్పుదురు. భారత విరాటపర్వ కృత్యాదియందలి "అతిపూని యాకృత్యంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు లోకమ్మునారాధన విశేషం బగుటఁ జేసి" అనువాక్యము లీయంశమును ధ్రువపరచుచున్నవి. ఈకృతిరచన మొకవిధమగు దేవతారాధనమనియే తిక్కన మనసార విశ్వసించెను, ఈతనితరువాతికవులు కొందఱీతని ననుసరించి తమ గ్రంథములను హరిహరనాథునకు గృతియొసంగిరి. నెల్లూరున నిప్పు డీయాలయము లేదు. పాండవుల యాలయ మొకటి కలదు. ఇప్పుడు రంగనాథస్వామి యాలయమున్నచోటనే పూర్వము హరిహరనాథుని యాలయము ముండెడిదనియు నది శిథిలమైపోఁగా నాప్రదేశమున రంగనాథాలయమును నిర్మించిరనియు జెప్పుదురు. నెల్లూరుకడ పెన్న రెండు పాయలైనదనియు, రెండవపాయ నెల్లూరునకు దక్షిణమున నుండెడి

దనియు. నదియొడ్డున పూడిపోయినదనియు, వారాయకు దక్షిణపు టొడ్డున హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు దాని శిథిల చిహ్నము లిప్పుడును గన్పడుచున్నవనియు కొందఱనియెదరు. బైచరాజు వెంకటనాథకవి తన పంచతంత్రము నీ హరిహరనాథునకుఁ గృతి యిచ్చియుండుటచే నాతని కాలము వఱకును (పదునైదవశతాబ్ది) నయ్యాలయ ముండెనని విశ్వసింపవచ్చును. సప్తగోదావరీ సంగమమున నొక హరిహరదేవాలయ ముండెడిదని ద్రాక్షారామమునందలి యొక శాసనము (పదకొండవశతాబ్దినాఁటిది. ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౪౯) వలనఁ దెలియుచున్నది. హరిహరనామక పట్టణమొండు కర్ణాట దేశమునఁ గలదు.

హరిహరనాథునిఁ బ్రశంసించుచు తిక్కనరచించిన యీక్రింది శ్లోక మాదేవునకుఁ బరమప్రీతిఁ గల్గించెనఁట!

"కిం నాస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే"

"ప్రభో! నీవు అలంకరించుకొనుటకై అస్థిమాల నిచ్ఛయింతువా లేక కౌస్తుభము నభిలషింతువా? నీకు కాలకూటము రుచ్యముగా నుండునా లేక యశోదా స్తన్యము రుచ్యముగా నుండునా నాకుఁ జెప్పుము" ఇది పైశ్లోకార్థము.

భగవంతుడు స్వప్నమునఁ బ్రత్యక్షమై శివకేశవుల కభేదమునుఁ బ్రతిపాదించుచు గ్రంథము రచించినందులకుఁ దనను గొనియాడు చున్నట్లీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు వర్తనముం దగ నిర్వహించుచు
న్వేదనము లేక భక్తి మతి నిర్మలవృత్తిఁ జేయుచుండ మ

త్రాపదవిరంగస్థ రజతస్ఫటికావము కల్మి నాస్మ ప
మోహ్మకమునఁ బొందఁ గావ్యాసమునం గొని యాడుచునుండు నెప్పుడున్.

స్వప్నసాక్షాత్కార కథఁ జెప్పిన వారిలో మొదటివాఁడు తిక్కనసోమయాజి. తరువాతివారు పెక్కురీతుల ననుకరించి తమ గ్రంథములలోఁ దమపూర్వులో, తమ నారాధించెడి దేవతలో స్వప్నమునఁ బ్రత్యక్షమైనట్లు వ్రాసికొనుచు వచ్చిరి. కాన నిదియొక యాచారముగాఁ బరిగణించి యట్లు చెప్పికొని యుందురని తలంచినచోఁ దిక్కనసోమయాజివంటి ధర్మాగ్రగణ్యున కీశ్వరసాక్షాత్కారము సొక్కెనని యూహించుటయే సమంజసము. పరమహంస రామకృష్ణునకుఁ గాళికాదేవి ప్రత్యక్షమగుచుండెడిదని చెప్పుటయు నది సత్యమని విశ్వసించుటయు నీయిరువదియవ శతాబ్దిలోనిదలి సంగతులు. మానవునకుఁ బరమేశ్వరసాక్షాత్కారము సంభవమని యీకాలమునఁ గొందఱికి విశ్వాసము. కాని యది యీ ప్రస్తావ్యవిషయము కాఁజాలదు.

హరిహరనాథుఁడు తిక్కన హృదయమున నిర్మించుకొనిన దేవుఁడే కాని యర్ధనారీశ్వరరూపుఁడు కాఁడని కొందరిమతము. అది సత్యము కాదు. హరిహరనాథాలయములు పూర్వకాలమున నచ్చటచ్చట నుండెడివనుటకు శాసనస్పష్టాంశములు కలవు. ఆయాలయము నందలి దేవవిగ్రహమున హరిహరరూపములు రెండును గనుపడునట్లు చెక్కబడియుండెడివని చెప్పుదురు. తూర్పుగోదావరిమండలమున రాజోలుతాలూకాలో కేశవస్వామి యాలయమున నెదుటిప్రక్క కేశవరూపమును వెనుకప్రక్క స్త్రీరూపమును మలచియున్నవి. శ్రీమహావిష్ణువు మోహినీరూపమున శివుని వంచించినకథను సూచించుటకై యీవిగ్రహమును నిర్మించిరని యచ్చటివారు చెప్పుచుందురు. కావున హరిహరనాథుఁడు కేవలమానసికారాధనకొఱకుఁ గల్పించు

కావున వారికంటె యర్వాచీనప్రాచీనుఁడుగాఁ గూడ నున్నాఁడని విశ్వసింపవచ్చును.

తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణమును రచియించు నాఁటికి పూర్వమే తలిదండ్రు లిరువురును స్వర్గము నలంకరించియుండి రని చెప్పుదురు. దీనినిబట్టి యీతఁడు బాల్యమునందే మాతాపితృహీనుఁ డయ్యెననియుఁ [illegible]ంచే పెంపఁబడి విద్యల నభ్యసించి సకలకళల బరిపూర్ణుఁ డయ్యెననియు నెంచదగియున్నది.

### తిక్కన యజ్ఞకథ:

తిక్కనామాత్యుఁడు రాజకార్యములలో నిమగ్నుఁడై యున్నను బ్రాహ్మణోచితములగు వైదికకర్మల నుపేక్షింపలేదు. నిర్వచనోత్తర రామాయణగద్యయందు "బుధారాధనవిధేయ తిక్కననామధేయ" యనియు, భారతగద్యయందు "బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి" యనియుఁ దెలుపుకొనియుండుటచే నీతఁడు నిర్వచనోత్తరరామాయణ రచనమునకుఁ దరువాతను, భారతరచనకుఁ బూర్వమునను జన్నము చేసెననుట స్పష్టము. కేతనకవి దశకుమారచరిత్రమునఁ దిక్కనను వర్ణించుచు "మహితదక్షిణలైన వివిధయాగంబు లొనరించుననుట వర్ణనము దాఁగి" యని చెప్పుటచే దశకుమారచరిత్రముఁ గృతినొందుటకుఁ బూర్వమే యీతఁడు యజ్ఞమును జేసియుండునని కొందఱనుచున్నారు. అది సత్యమైనచోఁ గేతనకవి యెచ్చటనైనను తిక్కన నామాంతమున నీతఁడు యజ్ఞకర్త యని సూచించుపదమును వేయకుండ నుండఁడు. అట్టి పద మేదియు దశకుమారచరిత్రమున లేదు. కావున నాయూహయందు సత్యము లేదని తేలవలసియున్నది. కేతన చెప్పినదానికి వైశ్వదేవాదియాగము లని యర్థము చెప్పవలసియుండును. మనుమసిద్ధి చనిపోయినపిదప భారతరచనారంభమునకుఁ బూర్వ మీతఁడు జన్నమొనర్చియుండునని నా యభిప్రాయము.

నన్నయభట్టు రచింపగా మిగిలినభాగమును పూర్తిచేయించుటకై తగినకవికొఱకు రాజరాజనరేంద్రుఁడు ప్రయత్నము చేయుచు, నన్నయ రచనమునందలి తుదిపద్యమగు:

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై"

యనపద్యము నొకతాళపత్రముపై వ్రాయించి యిట్లు వ్రాయఁగలిగిన కవు లెవ్వరైననున్నచో నీభావమును దమశైలిలో రచించి పంపుఁడని రాజ్యస్థానములకుఁ బంపెననియు, నది మనుమసిద్ధికడకు రాఁగా, దిక్కనసోమయాజి యీపద్యము నే వేఱొకపత్రముపై వ్రాసియిచ్చెననియు, నన్నయతో సమానముగా దాను వ్రాయఁగలనను తిక్కనభావమును గ్రహించి రాజరాజు తిక్కనను తనకడకుఁ బంపుమని మనుమసిద్ధిం గోరెననియుఁ దిక్కన యందులకు నంగీకరింపకపోఁగా మనుమసిద్ధికి గోపము వచ్చి "పలువురిలో నీబుఱ్ఱ గొఱిగించి విధులవెంటఁ ద్రిప్పి మానమును దీయించెద" నని తూలనాడెననియుఁ దరువాత రాజు పశ్చాత్తప్తుఁడై తనమాట నిలుపుకొనుటకై తిక్కనామాత్యునిచే యజ్ఞము చేయించెననియు నొకకథ చెప్పెదరు. కాని యిందులేశమాత్రమును సత్యము లేదు. (యజ్ఞము చేయువానికి క్షౌరమును, నూరేగుటయు, సోమపానమును గర్తవ్యములు)

మనుమసిద్ధి మహారాజు రాజరాజునకుఁ దరువాత రెండువందల సంవత్సరములలో నున్నవాఁడు. భారతమును బూర్తిచేయించుటకై రాజరాజు ప్రయత్నించెననుటకూడ నాధారములు లేవు. భారతమును దనకుఁ గృతియిమ్మని మనుమసిద్ధి యడిగెననియుఁ దిక్కన యందుల కంగీకరింపకపోఁగాఁ బైనిజెప్పినకథ నడచెననియుఁ గొందఱందురు.

గాని యెందును సత్యము లేదు. తిక్కన భారతమును రచించు నాఁటికి, మనుమసిద్ధి జీవించియుండెనో లేదో యని సంశయముగా నున్నది. భారతమును భగవంతునకుఁ గృతి యీయఁదలఁచినప్పు డందుల కభ్యంతరమును గలుగఁజేయు స్వభావము కలవాఁడు కాఁడు మనుమసిద్ధి. తిక్కనయెడల మనుమసిద్ధికి గౌరవము మెండు. శ్రీకృష్ణదేవరాయలు తన మంత్రియైన తిమ్మరసును "అప్పాజీ" యని పిలచినట్లే మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలుచుచుండెడివాఁడు. మనుమసిద్ధి తిక్కనలకుఁ గల యన్యోన్యగౌరవము నిర్వచనోత్తర రామాయణము నందలి యీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నున్న సత్కవీ
శ్వరులను భక్తిఁ గొల్చి తగ వారికృపం గవితావిలాస వి
స్తర మహనీయుఁడైన నను సర్వగుణోత్తమమూర్తి మన్మభూ
వరుఁడు దగంగ రాఁ బిలిచి వారక మన్నన నాదరించుచున్.

క. ఏ నిన్ను మామ యనియెడు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీవఁగవాఁడ దగు దనినను
భూనాయకుపల్కు చిత్తమునఁ గింపగుచున్.

సీ. సకలలోక ప్రదీపకుఁ డగు పద్మినీ
మిత్రవంశమున జనించె ననియుఁ
జూచిన మగలైనఁ జొక్కెడుఁ బుట్టి సౌం
దర్య సంపద సొంపుఁ దాల్చెననియు
జనహృదయానందజనకుఁడై నెగడిన
చతురత కల్మి నప్రతిముఁడనియు
మెఱసి యొండొంటికి మిగులఁ గౌర్యశౌర్యధైర్యగ
విఖ్యాతకీర్తుల వెలసెననియు

వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమాన విరచనాశాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుటకు సముత్సుకుఁడ నైతి.

మనుమసిద్ధి మహారాజు తిక్కనకు రాజచిహ్నముల నిచ్చి గౌరవించిన ట్లీక్రిందిపద్యమునఁ గేతనకవి చెప్పియున్నాఁడు.

గీ. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబకట్లు భూమి గానికగాఁ గరం
బెసఁగు రాచపదవులెల్లఁబడసె.

పైపద్యమునందు మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమ వేదియనియు, సరసబహుమాన విరచనాశాలి యనియు జెప్పియున్నాఁడు. అట్టి వాఁడు తిక్కనను [illegible] లేదు కావునఁ బైకథ యెంతమాత్రమును విశ్వసనీయము కాదు. కృతిని గన్యకతోఁ బోల్చిన వారిలోఁ దిక్కనయే మొదటివాఁడు. రాజరాజు పరీక్షార్థ మంపిన పద్యము పైనిజెప్పినది కాదనియు "నిండుమనంబు" అను పద్యమనియు గొందఱందురు. మఱియొకటియని యింకఁ గొందఱందురు.

తిక్కనతరువాతి నాతనివంశము :

తిక్కనసోమయాజికిఁ దరువాత నాతనికుమారుఁడు నెల్లూరునకు పడమట రెండుమూఁడు కోసుల దూరములో పినాకినీనదీతీరమందున్న పాటూరుగ్రామ కరణీకమును సంపాదించి యక్కడ నివాసమేర్పరచుకొనిరనియు నప్పటినుండియు వారు పాటూరివారని పిలువఁబడుచుండిరనియుఁ జెప్పుచున్నారు. ఈవంశావళిని వర్ణించు రెండు సీస పద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగా రాంధ్రకవుల చరిత్రమున నుదాహరించియున్నారు. ఆ పద్యములివి :

సీ. భారతపర్వము ల్పదియేను వరుసగాఁ
　　తెనిఁగించె గుంటూరితిక్కయజ్వ
యామహాత్మ్ముని పుత్రుఁడౌ కొమ్మనఘనుండు
　　కల్పించెఁ బాటూరి కరణికంబు
వాకొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు
　　నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు
రహిమీఱ నతనికి రామన తిప్పన
　　యారామనకు సోమయాహ్వయుండు
ఆఘనునకు వీరనామాత్యుఁ డతనికి
సోమలింగమంత్రి యామహాత్ము
నకును సోమరాజనామ్ముఁడు జీవీర
ఘనుఁడనంగ సుతులు గలిగి రందు

సీ. సోమమంత్రికిఁ గల్గెసుతుఁడు పాపనమంత్రి
　　యతనికిఁ బీరన యాఘనునకుఁ
గూరిమి తనయులు గోపాలభద్రార్య
　　నరసింహమంత్రు లనంగ మువురు
వారిలో నరసింహవరునకు శరభార్యుఁ
　　డును భాస్కరామాత్యుఁడు నరసింహ
ఘనుఁడనఁ బుత్రులు గలిగిరి మువ్వురు
　　వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేంక నామంత్రికి
శరభమంత్రివరుఁడు జనన మొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలోఁ దన
కులము వర్ధిలంగఁ గొమరు మీఱి.

ఇందులో మొదటిపద్యము పూర్వరచిత మనియు, రెండవ పద్యము శరభరాజు గారిచ్చిన వంశానుక్రమణికనుబట్టి బ్రహ్మశ్రీ శతఘంటము వెంకటరంగనాథశాస్త్రిగారు రచియించి రనియుం జెప్పుచు నీపద్యములను శరభరాజుగారు వీరేశలింగము పంతులు గారి కిచ్చిరంట. పాటూరి కరణికమునుబట్టి వీరు పాటూరి వారైనారంట.

కొందఱీ వంశావళిని గూర్చి సంశయమునుం దెలుపుచున్నారు. తిక్కనసోమయాజి యుపయోగించిన గంటపుఁబర చాలకాలము వీరి యింట నుండెననియు నందుపై నొకప్రక్క సరస్వతి విగ్రహము నొకప్రక్క విఘ్నేశ్వర విగ్రహము చెక్కఁబడియున్నదనియు బ్రతీతి కలదు, అది యిప్పుడున్నదో లేదో తెలియదు. బ్ర॥ శ్రీ వీరేశలింగము పంతులుగారీ వంశావళినిబట్టి తిక్కన కాలము నిర్ణయింపయత్నించిరి. ఇప్పుడు శాసన ప్రామాణ్యమున వీరుభయుల కాలము స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున నందుల కీవంశావళికిఁ బలము లేదు. మడికిసింగనకుఁ బితామహుఁడైన యాల్లాడమంత్రి తిక్కనసోమయాజి పౌత్రిని బరిణయమాడెనని సింగకవికృత వాసిష్ఠరామాయణములోఁ జెప్పఁబడి యున్నది.

ఆంధ్రభాష కీతఁడొనర్చిన సేవ :

ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారిలోఁ దిక్కన యగ్రేసరుఁడు. నన్నయాదు లాంధ్రభాషలోఁ గావ్యములను రచించినను, వారి కావ్యములలో సంస్కృతపదము లధికమును, ఆంధ్రపదములు స్వల్పముగను నున్నవి. నన్నెచోడుఁడు, సోమనాథుఁడు మొదలగు శివకవులు తమ గ్రంథములలో దేశీయపదముల నధికముగనుపయోగించి యాంధ్ర సాహిత్యాభివృద్ధికై యెక్కువగా పాటుపడియుండిరి. తిక్కనసోమయాజి రెండు గ్రంథములను రచియించుటే కాక, యాకావ్యములలో

దేశీయపదములను జక్కగా సంస్కరించి యుపయోగించి, తన రచనములనాంధ్రసాహిత్య గ్రంథములనుగాఁ జేసెను. ఆంధ్రాభ్యుదయ రచయితలలోఁ దిక్కన యగ్రగణ్యుఁడని చెప్పనొప్పును. ఆంధ్రసాహిత్య పోషణమున కీతఁడు పడినశ్రమ యపారము. ఈతనిరచనములు రెండును సంస్కృతమున కాంధ్రీకరణములైనను, ఇతఁడు గొప్పసంస్కృతపండితుఁడైనను, నీతని కవిత్వమునందుఁ "నన్నుపయోగింపుఁడు నన్ను కొనుఁడని సంస్కృతపదములు ముందునకువచ్చి యుఱ్ఱూతలూగించుచున్నను, నాంధ్రభాషాభివృద్ధియే మనమున నిడుకొని విశేషముగా జాతీయపదములనే యుపయోగించి, రసముప్పతిల్లునట్లు కావ్యరచన సాగించినవాఁడీమహాకవి. ఈతని కవిత్వమునందు సంస్కృతపదములున్నను నవి యతిమృదులములై సారూప్యములు వాడుకొనుచుండునట్టివియుఁ "ఏవి సంస్కృతపదములా? జాతీయములా?" యని సంశయము గ్గించునట్టివియునై యున్నవి. ఈతఁడు తన రచనావిధానమునుసూచించుచు నిర్వచనోత్తర రామాయణమున:

ఉ. జాత్యముగాని నొప్పయినసంస్కృత మెయ్యెడఁ జొప్పు: వాఙ్మయాం
గత్వము సేయుచోనయిన గద్యములోఁ జొప్పుపెట్ట; దా
గ్రత్వము దోఁపఁ బ్రాసము పరిహారము వేఱగునక్కరంబులన్
బ్రత్యనురూప మంచునిడ; సూరుల కిప్విధ మింపుఁ బెంపదే.

అనుపద్యము జెప్పి యారీతిగనే తన కావ్యములను విరచించినాఁడు. ఈసందర్భమునఁ దిక్కన కవిత్వపుసొంపు సూపుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుట యావశ్యకము కాకపోదు.

ఉ. నన్నుఁ బరాభవించి పదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్నుమొగుడ్పమాటుటకుఁ గారణమెయ్యది భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా! (వి.వ)

క. ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభంబైనదాని నొదఁగూర్పుచు దా
శ్రీపుష్పపుత్రుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా!

ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెవ్వానికి
నట్టివానికి నుచిత మైనపనుల
మొనసెఁ దడయ కింక నొప్పదు జనములు
నల్లుఁగాని ప్రియము లనరు మిమ్ము   ఉ. ప.

తే. వట్టపకలింటి పూర్వోద్భవగిరిఁ గద్దఁ
దుగ్రమూర్తియై వెలుఁగుచున్నవాఁడు
మాధవా! మాకు రథంబును మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు బడయవచ్చు.   క. ప.

చ. వెరవును లావు నేవయును వీరల కారయ నొక్కరూపు దు
స్తరభుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడగించి యివ్వసుం
ధరఁ గొనునొక్క నేఁడితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపునొకొ శల్యుఁడు కౌరవరాజనందనున్ (శ. ప)

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁ [డున్
నేరనివాఁడు బొంకరియు నిందకు నోర్చునతండుఁ బంనయున్
ధీరత లేమి దుర్ణయు మతివ్యసనత్వముఁ గల్గువారలుం
జేరువ నుక్కు భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా! (శాం. ప)

సీ. దివియలోఁ బడుఁబురువు దివియ యెత్తినవానిఁ
బాపంబు పొందునే! యోపి దున్న
వాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుఁ బొందునే యఘముఁ? వాసు

దనువను శ్వేసుర విధాత్రివళమున నా
యువు దెగినట్టిజంతువులు సచ్చు
నేము సంపితిమని యెంచు కనియు నహం
కారంబు వారికిఁ గలుగ దట్లు
ఆ. గాన చూడ వారిఁ గల్మష మొందదు
పుణ్యపాపములకు బుద్ధిమూల
మసి కిరుండు మాఱియు పనుహింసవోలె నై
యా ధీ ధర్మ్య మైనపథము వినుము. ఆ. వ.

ఉ. ఏను హితంబు సెప్ప వినవు లేని దురాచరణంబు లిమ్మెయిన్
మానవు రోగి చేఁదనుచు మందు భుజింపఁ దెవు లంటఁదాకినం
గాని తెవుళ్ళు దప్పు ప్రతికారము గల్గునె యట్లపోలె నీ
వైన నికృష్టవృత్తిఫల మంది తలంచెదు గాక పిమ్మటన్. ని. రా.

స్థాలీపులాకన్యాయముగ నీపద్యములఁ జూపితిని. గ్రంథమంతయు నిట్లే యుండును. ఈతనినిఁ జూచి కేతనమారనాదు లిట్లే తమగ్రంథముల యందు జాతీయపదముల నుంచి రచించుచువచ్చిరి. కాని శ్రీనాథాది మహాకవులు కొందఱీమార్గమును విడనాడి తమకావ్యములను సంస్కృత పదజాలములతో నింపివైచిరి. సాంస్కృతిక దీర్ఘసమాసములతో గ్రంథములను రచించుటయే గొప్పతనమని తలంచినకవులుకూడఁ గొండఱు కలరు. ఆంధ్రభాషలోఁ గావ్యరచనము చేయఁదలచికొనినప్పుడు దేశీయపదములతోఁ బాఠకలోకమునకును వినువారికిని హృదయాహ్లాదమును గలుగఁజేయునట్లు రచియించుటయే గొప్పతనమగును గాని నిఘంటుసాహాయ్య మొందినఁగాని యర్థముకాని గూఢసంస్కృత పద సమాసములతో నాంధ్రకావ్యమును రచించుట గొప్పతనము కాఁజాలదు. ఈసందర్భమున మొల్ల తన రామాయణమునఁ జెప్పిన

క. మును సంస్కృతంబు తేటఁగఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనరిక్క మెఱయఁ గ్రిమ్మఱ
ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే.

ఆ. తెనుఁగునకు నోరు తియ్యన యగురీతిఁ
దోన యర్థమెల్ల దోఁపకున్న
గూఢశబ్దతతి కొల్లాలవని చెల్ల
మూఁగ చెవుడు నాడుమచ్చుటగును

క. కందవమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పినది తెనుఁగునకున్
బొందై రుచియై పిన్నల
విందై మఱి కాఁపించు విబుధులకెల్లన్.

అను పద్యములు స్మరణకు వచ్చుచున్నవి. తిక్కనసోమయాజి తన గ్రంథములయందు ప్రయోగించిన దేశీయపదములు వేలకొలఁదిగ నున్నవి. సంస్కృతపదముల విషయమున "బాణోచ్ఛిష్టం జగత్రయ" మ్మనెడు మాట దేశీయపదవిషయమున నీమహాకవికి వర్తించు ననుటకు సంశయము లేదు. ఈభావమును దశకుమారచరిత్రకృతికర్త యగు కేతన కవి "అగుననఁ గొమ్మ తిక్కఁడు" (ఈపద్యమును పైన దాహరించితిని.) అనుపద్యములో వ్యక్తీకరించి యున్నాఁడు.

### ఇతని కవిత్వగుణము :

అద్వితీయ ప్రతిభావంతుఁ డగు నీమహాపురుషుని కవిత్వగుణము చూపనెంచుట సూర్యుని కాగడాలోఁ జూపనెంచుట వంటిది. ఆంధ్ర కవులలో నితనితో సమాను లింకొకరు లేరు. ఈతని కవిత్వ మింతగా సర్వజనాకర్షణీయ మగుటకుఁ గారణములు కొన్ని గలవు. అందు

మొదటిది:— ఈతఁడు చేపట్టిన కావ్యములయందలి యితివృత్తములు. ఆర్యులమగు మనకుఁ గల యితిహాసములలో శ్రేష్ఠములయినవి రెండు. భారతము, రామాయణము. ఈ కావ్యములు రెండింటి నీతఁడు చేపట్టినాఁడు. "మణినావలయమ్ వలయేన మణి" యనునట్లు కవిత వలన కథయును కథచేఁ గవితయు శోభకెక్కును. వ్యాస వాల్మీకుల ప్రతిభ జగద్విదితమగుటచేఁ గాఁబోలు నీ కావ్యముల యందలి యితివృత్తములే తన కవితాశక్తిని ప్రదర్శించుటకుఁ దగిన కథ లీతనికి లభించుట గొప్ప యదృష్టము.

రెండవది:— పదసౌష్ఠవము ఈతని కవితయందు పెద్దపెద్ద సంస్కృత సమాసము లుండవు. చిన్నచిన్న దేశ్యపదములనే విశేషముగా నీతఁ డుపయోగించును. ఏతావున నేపదముపయోగించిన రస మవ్వతిల్లునో యీతఁడు విచారించినటు బాగుగాఁ దెలియును. ఎచ్చటనైనఁ సంస్కృతసమాసము లున్నను, అవి మృదుపద సంయుతములై మనోహరముగా నుండును. వాని యర్థమును గ్రహించుటకై నిఘంటు వ్యాకరణముల యక్కరయుండదు.

మూఁడవది:— అర్థగాంభీర్యము. ఎంతచిన్న పదముల నుపయోగించినను వానిలో నెంతయో గాంభీర్యమగు నర్థ మిమిడియుండును. పాఠకుని శక్తి కొలఁది నందలి భావగాంభీర్యము విదితమగుచుండును.

నాల్గవది:— వ్యర్థపదరాహిత్యము. ఇతని కవిత్వమునందుఁ బాదపూరణమునకును యతిప్రాసల కొఱకును తెచ్చిపెట్టుకొనెడి పదము లుండవు. ఎచ్చటనేని స్వల్పముగా నట్టి పదము లున్నను నవి కేవలము పడికట్టురాళ్లుగా నుండక యవియుఁ గూడ నెంతయో కొంత తూకమును దెలుపునవిగానే యుండును.

ఐదవది:— పాత్రౌచిత్యము. కవిత యెంతరసవంతముగ నున్నను, పాత్రపోషణము యుక్తముగ లేకున్నచో సహృదయుల కానందము కలు

గదు. భారతమున ప్రధానపాత్రములు రెండు ధర్మరాజును, ద్రౌపదియు. తిక్కన నీయిరువురను భారతమునఁ దుదికంటెఁ జక్కగా పోషించినాఁడు. ఈ విషయమున వ్యాసునికంటె నీతనిదే పై చెయ్యియైనది. ధర్మరాజుక్తి రాజనీతిజ్ఞత, సమయోచితజ్ఞానము కార్యదీక్ష. ఇంద్రియనిగ్రహము, సత్యాగ్రహము, ఓర్పు మొదలగు గుణములను జూపుచు దిక్కనవ్రాసిన భాగముల నొక్కచోఁ జేర్చి చూపినచో, లోకమున కెంతయో మేలు కలుగునని నాయభిప్రాయము. భారతమందలి యితరపాత్రములనుగూడ నీతఁడు చక్కగా పరివర్ణించినాఁడు.

ఆఱవది:— భావప్రకటనము. తాను చెప్పఁదలచుకొనిన భావములు పాఠకులకు స్పష్టముగాఁ దెలియునట్లు చిన్నచిన్న మాటలతో వ్రాయు నేర్పు కవిశేఖరున కలవడినట్లితరులకు కలవడలేదు. ఇరువురువ్యక్తులు మాటలాడునప్పుడది పద్యరూపమున నున్నను దృశ్యప్రబంధములో వలె నెదురుగా గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లేయుండి పాఠకునకెంతయో యానందము కలిగించుచుండును. పౌరాణికున కట్టిసందర్భములలో వారి భావమును దనమాటలతో శ్రోతలకు విప్పి చెప్పుట కవకాశము కలుగుచుండును. ఎంతటి కఠినవిషయము నైనను చిన్నమాటలతో సులభముగా బోధపడునట్లు చెప్పుటలో నీతఁడు మిగుల నిపుణుఁడు.

ఏడవది:— రసపోషణము. సందర్భము ననుసరించి నవరసములును పాత్రలకుఁ దనుభవించుటకుఁ దగిన యతివృత్తమును గల్పించుట యందును, ఆరస ముప్పతిల్లుపదముల నుపయోగించుట యందును రసపోషణమునందును నీతనికిఁ గల శక్తి యపారము.

ఎనిమిదవది:— లోకజ్ఞానప్రదర్శనము. ఈ మహానుభావుఁడు కేవల పండితుఁడును గవియును గాక లోకజ్ఞానమెఱింగిన మహామేధావి.

శాస్త్రముల యందును గ్రంథములయందును జెప్పఁబడినదియే గాక నిత్యమును ప్రపంచమున జరుగుచున్న విషయములను గ్రహించి యందలి మంచిచెడ్డల నెఱింగి లోకవ్యాపారమును గాంచి, తన యనుభవజ్ఞానమును దన గ్రంథములయందు బ్రకటించిన మహాపురుషుఁడీతఁడు.

ఈ కారణములచే నీతని కవిత్వము పండితపామర జనానురంజకమై సర్వజనహృదయాకర్షణ మొనరించుచున్నది. వీని కుదాహరణములను జూప నెంచినచో నది యొక పెద్దగ్రంథమగును.

ఈతని యాంధ్రీకరణ విధానము :

ఈ మహాకవి భారతాంధ్రీకరణమును యథేచ్ఛగా సాగించినాఁడు కాని మక్కికిమక్కిగా చేయలేదు. ఇతఁడు విరాటోద్యోగ పర్వములలో మూలమందలికథను మాత్రము గైకొని తనయిష్టము వచ్చినట్లు పెంచియుఁ గుదించియుఁ బాత్రౌచిత్యముకొఱకును రసపోషణము కొఱకును బాలమార్పులఁ గావించి యాపర్వములను స్వతంత్ర గ్రంథ మనునట్లుగా రచించినాఁడు. భారతమునందు పాఠకులకును శ్రోతలకును నెక్కువయాహ్లాదమును గలిగించినవి, విరాటోద్యోగ పర్వములు. తిక్కనసోమయాజి తన లోకజ్ఞానమును, పాత్రౌచిత్యమును గనుపఱచి, యీ రెండు పర్వములను రచించియుండెను. ఈతని యాంధ్రీకరణ విధానమును జూపుటకై యీపర్వములనుండియే దృష్టాంతమును గైకొనుట సమంజసమని యట్లుచేసితిని.

కౌరవసభకు శ్రీకృష్ణుఁడు రాయబారము పోవనున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునితో నుడివినవాక్యములను, సంస్కృతభారతము నుండియు. ఆంధ్రభారతమునుండియు నొత్తి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

"సుతా ద్రుపదరాజస్య అసితాయతమూర్ధజా
సంపూజ్య సహదేవంచ సాత్యకించ మహారథమ్"
"భీమసేనంచ సంశాంతం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్యమువాచేదం మనస్వినీ."
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథా నికృతి మాస్థాయ భ్రంశితాః పాండవా స్సుఖాత్."
ధృతరాష్ట్రస్య పుత్రేణ సామాత్యేన జనార్దన
యథాచ సంజయో రాజ్ఞా మంత్రం రహసి శ్రావితః"
"యుధిష్ఠిరేణ దాశార్హ తచ్చాపి విదితం తవ
యథోక్తః సంజయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా."
"పంచనస్తు దీయంతాం గ్రామా ఇతి మహాద్యుతే
అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్."
"అవసానం మహాబాహో కంచిదేకంచ పంచమమ్
ఇతి దుర్యోధనో వాచ్య స్సుహృద శ్చాస్య కేశవ"
"నచాపి వ్యాకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః
యుధిష్ఠిరస్య దాశార్హ హ్రీమత స్సంధి మిచ్ఛతః"
"అప్రదానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః
సంధి మిచ్ఛే న్న కర్తవ్య స్తత్ర గత్వా కథంచన."
"శక్ష్యంతి హి మహాబాహో పాండవా స్సృంజయై స్సహ
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్."
"నహి సామ్నా న దానేన శక్యోర్థ స్తేషు కశ్చన,
తస్మా త్తేషు న కర్తవ్యా కృపా తే మధుసూదన."
"సామ్నా దానేన వా కృష్ణ యేన శామ్యంతి శత్రవః
మోక్తవ్య స్తేషు దండ స్స్యాత్ జీవితం పరిరక్షతా."
"తస్మా త్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయా చైవ మహాబాహో పాండవై స్సహసృంజయైః"

"ఏతత్సమం ధర్మం పార్థానాం తవచైవ యశస్కరమ్
క్రియమాణం భవేత్ కృష్ణ క్షత్రస్యచ సుఖావహమ్"
"క్షత్రియేణహి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః
అక్షత్రియోవా దాశార్హ స్వధర్మ మనుతిష్ఠతా"
"అన్యత్ర బ్రాహ్మణా త్తాత సర్వపాపే ష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్"
"యథా వధ్యే భవే ద్దోషో వధ్యమానే జనార్దన
సవధ్య స్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః"
"యథా త్వాం నస్పృశే దేష దోషః కృష్ణ తథా కురు,
పాండవైః సహదాశార్హ సృంజయైస్సహ సైనికైః"
"పునరుక్తంచ వక్ష్యామి విస్రమ్భేణ జనార్దన,
కానుసీమంతినీ మాదృక్ పృథివ్యా మస్తి కేశవ"
"సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యా త్సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణప్రియాసఖీ"
"ఆజమీఢ కులంప్రాప్తా స్నుషా పాండో ర్మహాత్మనః
మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్ర సమవర్చసామ్."
"సుతా మే పంచభి ర్వీరైః పంచజాతా మహారథాః,
అభిమన్యు ర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః"
"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ."
"జీవత్సు పాండుపుత్రేషు పాంచాలే ష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా."
"నిరమర్షే ష్వచేష్టేషు ప్రేక్షమాణేషుపాండుషు
పాహి మా మితి గోవింద మనసా చింతితోఽసిమే."

"యత్రమాం భగవా న్బ్రహ్మా, శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృణీష్వ పాంచాలి వరార్హాసి మతాసి మే."
"అదాసాః పాండవా స్సంతు సరథా స్సాయుధా ఇతి
మయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ."
"ఏవంవిధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన
త్రాయస్వ పుండరీకాక్ష సభర్తృజ్ఞాతిబాంధవామ్."
"నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః
స్నుషా భవామి ధర్మేణ సాహం దాసీకృతా బలాత్."
"ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్త మపి జీవతి."
"యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపా మయి,
ధార్తరాష్ట్రేషు వై కోపః సర్వః కృష్ణ విధీయతామ్."

వైశంపాయనః,

"ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్
సునీల మసితాపాంగీ సర్వగంధాధివాసితమ్."
"సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్
కేశపక్షం వరారోహా గృహ్యసవ్యేన పాణినా."
"పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచన మబ్రవీత్."
"అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః
స్మర్తవ్య స్సర్వకార్యేషు పరేషాం సంధి మిచ్ఛతామ్."
"యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ.
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్రై ర్మహారథైః."
"పంచచైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ."

"దుశ్శాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుకుంఠితమ్,
యద్యహం తం న పశ్యామి కా శాంతిః హృదయస్య మే."
"త్రయోదశహి వర్షాణి ప్రతీక్షంత్యా గతాని మే,
నిధాయ హృదయే మన్యుం ప్రదీప్తమివ పావకమ్"
"విదీర్యతే మే హృదయం భీమవాక్శల్యపీడితమ్,
యోఽయ మద్య మహాబాహు ర్ధర్మమే వానుపశ్యతి."
"ఇత్యుక్త్వా బాష్పసంఘేన కంఠేనాయతలోచనా,
రురోద కృష్ణా సోత్కంపం సస్వనం బాష్పగద్గదమ్."
"స్తనౌ పీనాయతశ్రోణీసహితా వభివర్షతీ,
ద్రవీభూత మివాత్యుష్ణం ముంచతీ వారి నేత్రజమ్."

ఈ శ్లోకములయందును సులభగ్రాహ్యములగుటను, గ్రంథవిస్తర భీతిచేతను వీనికిఁ దెలుఁగు వ్రాయలేదు.

గీ. ధర్మనందనుపలుకులు దనదు హృదయ
తాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁబలికె
గనలి శోకంపు గద్గదకంఠి యగుచు.

ఉ. అంతలుసేసి పోనడచి యక్కట! సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె? ఇట్టియూఱడి మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు దా
నంతన యూఱట లేవుఁడ నైదు సుయోధను డిచ్చునొక్కొ? ఈ
కంఠకృపావిహీనమతి వాఁడు నెచునె యన్నదమ్ములన్!

చ. తనమునుపడ్డ బన్నములఁ దమ్ములపైఁ గలకూర్మి పేర్మి నీ
జనపతి సైపనున్నె? యదిపక్కనః రాజ్యముపాలు లేక తీ
ఱున కొఁదబాటు గల్గిన, నెఱుఁగమి వెట్టరె? చాలరైరి వీ
రనరో కాఁ నానలేమియని యాడరె లోకమువారు కేశవా?

శా. పెంపేదం జమోకట్టితక్కువలు రూపింపంగ నేలా? విచా
రింపన్ వారికి మేలు సంధి యిమువారిం జూచినం దారు సా
ధింపంజాలరొ? కాక పోరం దగమర్ధింపం దలంపేని శం
కింపం బట్టరొ? వారు బ్రాహ్మణులె? యేకీడైన సైరింపంగన్.

ఉ. ఓటమి యొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలం బోవునే దురభిమానము? యొక్కడు పూనుగాక, యా
చోటన సంగరంబు లగుచొప్పులు పుట్టిన నైనం బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ? పోదురొ? కానలనుండ నచ్యుతా!

ఉ. ఏటికింటి నావలన దింకను నీవును రాజధర్మలం
గానుచితంబు చూచి యనివార్యము, మానుషసత్వముం దెడం
గా నొకభంగి సేయక తగం గురువర్గముతోడి సంధి మా
నైన తెలంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పుతేర్పుగన్

ఉ. ఆలసిలోకయుక్తి, ఫలమందుటయుక్తి, గని పెక్కునేరమిన్
మాటలనోరిదానసయి మాటలు చిత్తమునందు నిల్పకే
గాటపు ప్రేలెదన్ వినుఁడు, కర్ణము నెగ్గుము గాన నల్కమై
పాటికి నైనమానిసికి వెండి వివేకము గల్గనేర్చునే.

చ. వరమునఁ బుట్టితిన్, భరతవంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్, సహజన్ముల ప్రాపుఁ గాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తి కెక్కినదాన నెంతయున్.

వ. అట్లుంగాక,

ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు; దిట్టినఁ బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందినవేణి పట్టి యీ
డు పురుఁ జూడఁగా సభకు నీడ్చె! కులాంగన లిట్లొనర్తురే?

ఉ. ఆసభ కేశవస్త్రి యగుటట్టి నడం గొనివచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతు లసంభ్రములై తగు నెష్ట లేక నా
యాసలు మాని చిత్రితుల యాకృతినున్నయెడన్, ముకుంద! వి
శ్వాసములోడ నిన్ గొలువవచ్చు మనం బదియుం దలంపవే?

చ. అరయ మిఁజేసి కోడలను కష్టుడు దాసిగఁజేసె నన్నుఁబో
పురుషుని పాలికిం బతులు పోవఁగ వీరలతోన యేను జె
ప్పరఁజని కొలఁదిం బు దగఁజేయుదునో? అటుగాక పాడిసై
వరవుడమోపి చేయుదునొ వారికి? మాధవ సిద్ధ్యయింపుమా!

వ. అని యట్లు గ్గడించి,

ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడిఁ గ్రమ్మనవిచ్చి చంద్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నాఁ గలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు కిపాపరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ డగ్గుతేచి యార్తయై.

క. ఇది దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెళ్ళపోయి దక్కినయది కా
రవుఁ కడ దీఱుమాటల
యవసరమునఁ దలఁచవలయు నచ్యుత! వీనిన్.

సీ. ఈ వెండ్రుకలు వట్టియీడ్చిన యాచేయి
దొలుతగా, బోరి కో దుస్ససేను
తను విందలింగలు తనియలై చెదరి రూ
పఱియున్నఁ గని యుడుకాఱుగాక
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది?
పెనగిదఁ వట్టిన భీమసేను
బాహాబలంబునుఁ బొలించి గాండీవ
మనునొక విల్లెప్పుడును వహించు

ఆ. కట్టిడికత్తిమంబుఁ గాల్పనే? యిట్లు
ఖిన్నమలినవదన ధర్మనందనులదు
నేను రాజరాజపీనుంగుఁ గన్నారఁ
గానఁబడయ మైతిమేలఁ గృష్ణ?

ఉ. నెట్టన యిట్టియుల్కు మదినిల్పితి రక్కసకొల్లఁజి చాపడిం
గట్టినకొట్లు పెద్దయును గాలము దీనికి వాఱు లెన్నఁడుఁ
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాఁచు నట్టితోఁ
బుట్టువు నీవు, తేజమునఁ బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

వ. అనుచు పలుఁగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను, బెన్నతివేణి మధువనుం దగువారి నియోగించి యమ్మానినితో నిట్లనియె."

పై శ్లోకములను బద్యములను జదివి చూచినచో సంస్కృత భారతమునకుఁ దిక్కనసోమయాజి రచనము వన్నె పెట్టినదని తోఁపక మానదు. ఈ సందర్భమున శ్రీ కొ. లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిన వాక్యముల నుదాహరించెదను. "తిక్కనకృతి భారతము సంస్కృతమహా భారతమునకు భాషాంతరీకరణ మని మనవారంద ఱనుకొనుచున్నారు; కాని యది గొప్పపొరపాటు. ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొకయపరాధము సేయుటయే. సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆంధ్రభారతము ఆ ముద్దలోనుండి కావలసినంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కనిసువర్ణకమలము వంటిది. ఉభయభారతములలోని యీ భేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడిచేయుటయే మాయుద్దేశము" విరాటోద్యోగ పర్వములందక్క తక్కినభాగమును దిక్కన క్లుప్తముచేసినాఁడు.

పూర్వకాలమున విశేష రాజకార్యములలో నవసరము వచ్చి నప్పుడు మహారాణులు కూడ సభలోనుండి చర్చలలోఁ బాల్గొను చుండెడివారని యీకథవలన మనకుఁ దెలియుచున్నది. ఇట్టిసంప్రదాయము పురాణయుగములో నేకాదు. చారిత్రకయుగమునఁ గూడఁ గలదు. పదునాలుఁగవ శతాబ్దిప్రాంతమున మనదేశముపైకి దండెత్తి వచ్చిన మహమ్మదీయులకు సాహాయ్య మొనర్చుచున్న జయచంద్ర మహారాజుపై యుద్ధముచేయఁబోవుచు నాతనియల్లుఁడగు పృథ్వీరాజు చిత్తూరురాణాయైన సమరసింహుఁడు మొదలగు మహారాజులతో నాలోచించుటకై యొకసభను సమకూర్చెననియు, పృథ్వీరాజు యాజ్ఞానుసారముగ నాతని రాణియు జయచంద్రుని తనయయు నగు సంయుక్తాదేవి యాసభకువచ్చి సమరతంత్రములఁ బాల్గొని దేశమును సంరక్షించుటకై జయచంద్రునితోఁ బోరుసలుపుట యుచితమే యనియు నందుఁ దండ్రి ప్రాణములు పోయినను దానికొఱకుఁ జింతింపననియుఁ దెల్పి భర్త ప్రయత్నమునకుఁ దోడుపడియెననియు, నప్పుడాసభయందున్న చాందాభట్టుఅనుమహాకవి 'పృథ్వీరాజరాసా' యనుగ్రంథమున వ్రాసి యున్నాఁడు

## తిక్కనమహాకవి రచించిన కావ్యములు :

తిక్కనసోమయాజి సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుదురు. కాని రెండుగ్రంథములు మాత్రమే మనకిప్పుడు లభ్యము లగుచున్నవి. అందు మొదటిది నిర్వచనోత్తర రామాయణము. రెండవది శ్రీమహాభారతము.

## నిర్వచనోత్తర రామాయణము

ఇది వాల్మీకిరామాయణములో సప్తమకాండమున కాంధ్రీకరణము. రావణవధానంతరము శ్రీరామచంద్రుఁ డయోధ్యయందు పట్టాభిషిక్తుఁడగుపర్యంతము జరిగినకథకుఁ బూర్వరామాయణమని పేరు. ఇది

యాఱుకాండలు కలది. ఈయాఱు కాండములలోను జెప్పని రావణ జననాది పూర్వవృత్తాంతమును శ్రీరామపట్టాభిషేకానంతర సీతావనవాస కథయు కుశలవ జననాది కథలును నేడవకాండమున నున్నవి. దీని కుత్తరరామాయణమని పేరు. దీని నీ యుభయకవి మిత్రుఁడు తెనిగించెను. గ్రంథమం దెచ్చటను వచనము లేకుండ రచియించుటంజేసి దీనికి నిర్వచనోత్తరరామాయణమని పేరువచ్చినది. కవులు సాధారణముగాఁ గథాసందర్భమును గలుపు పట్టులయందును, వర్ణనలను జేయుపట్టులను వచనములను రచియించుచుందురు. అట్టివి లేకుండ నాభాగములను గూడఁ బద్యములచేఁ బూరించిన సొంపుగ నుండునని తన యభిప్రాయమును దిక్కన యీక్రింది పద్యములలో వ్యక్తీకరించినాఁడు.

క. వచనము లేకయ వర్ణన
రచియింపఁగఁ గొంతవట్టుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములనె పొం
దుచితంబుగఁ జెప్పుటార్య లొప్పిద మనరే?

క. లలితపదహృద్యవర్ణం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలుఁగా
మాల సంధించిన విధంబు నమరఁగవలయున్.

ఇక్కడ పూర్వరామాయణమును విడచి యుత్తరరామాయణమును దెనిఁగించుటకు గారణ మంతకుఁ బూర్వమే పూర్వరామాయణమును భాస్కరుఁడాంధ్రీకరించియుండుటయే యనియు భాస్కరరామాయణమును రచించిన దీతని పితామహుఁడైన భాస్కరుఁడే యనియుఁ గొందఱనుచున్నారు. ఈసందర్భమునఁ దిక్కన రచించిన రెండుపద్యములను దాహరించుచు వానిఁ గూర్చియు, భాస్కరరామాయణ కర్తృత్వమును గూర్చియు మంత్రి భాస్కరుని చారిత్రమున విపులముగాఁ

వర్ణించియున్నాఁడను. ఆవిషయములను మరల నిటవ్రాయుట పునరుక్తి యని విడచితిని. తిక్కనసోమయాజి భారతాంధ్రీకరణమువలెనే నిర్వచనోత్తర రామాయణమును పక్కికిమక్కిగాఁ జేయక స్వేచ్ఛగానొని రచించియున్నాఁడు. నిర్వచనోత్తర రామాయణమును పది యాశ్వాసములుగా రచియించి తనప్రభువగు మనుమసిద్ధి మహారాజున కంకితము చేసెను. ఇందు నన్నయవలెనే యితఁడును తన గ్రంథము మొదల నాంధ్రపద్యమును వ్రాయక యీక్రింది సంస్కృత శ్లోకమును రచియించెను.

శ్లో॥ శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తమ్భే జగన్మణ్డల
ప్రాసాదస్థితి భారభాజి దధతీ పాషాణభఞ్జీశ్రియం
యత్సాలోత్తమగణ్డభిత్తిషు మదవ్యాసఙ్గవశ్యాత్మనాం
యా ముక్తేవ యశస్వితాం వ్యధులిహా మానన్దసాన్ద్రస్థితిః॥

శ్రీ మహాభారతము

వ్యాసవిరచితమైనసంస్కృతభారతమునందలిపదునెనిమిదిపర్వముల లోను నన్నయభట్టు ఆదిపర్వమును, సభాపర్వమును, అరణ్యపర్వమునఁ గొంతభాగము నాంధ్రీకరించెను.

తిక్కనసోమయాజి యరణ్యపర్వమునందలి తక్కిన భాగము నాంధ్రీకరింప వలసియుండఁగా దానిని విడచి విరాటపర్వాదిగాఁ బదునైదుపర్వముల నాంధ్రీకరించెను. తిక్కనరచించిన :

ఉ. ఆదరణీయ పారవిదార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతమై పెనుపొంపియుండ నం
దాదిఁ దొనంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్
మ. హృదయాహ్లాదిచతుర్థమూర్తికథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వముల యుద్యోగాదులుం గూడఁగా

బదునేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టం రచియించె నొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.

అను పద్యములనుబట్టి యారణ్యపర్వమును నన్నయభట్టు పూర్తి గనే రచించినట్లు కన్పట్టుచున్నది కాని సాక్ష్యమిందులకు వ్యతిరేకము గా నున్నది. ఈవిషయమునుగూర్చి యెఱ్ఱాప్రగ్గడచరిత్రమునఁ జర్చింపఁ దలంచి యిట వదలివైచితిని.

ఆంధ్రలోకాభ్యుదయమును గాంక్షించి, ఈమహాభారతనిర్మాణ కార్యమునకుఁ దాను సంసిద్ధుఁడనైతినని యీకవిసార్వభౌముఁ డీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

"ఉ. శాసన భారతాన్వయము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదమందఁ బొరయున్నట్లుగ సాత్యవతేయ సంస్కృతి
శ్రీభవదాస్పదంబగు విచిత్రము తోడ మహాకవిత్వదీ
క్షావిధి నాంధ్రపద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్"

పరిశాంతహృదయముతో భారతరచనమునకు దీక్షఁ గైకొనిన యీ పుణ్యపురుషుఁడు తెలుఁగుభాషలో భారతమును రచియించుట "పురుషార్థపరిపక్వఫల"మని హరిహరనాథుఁడే రచియించిన ట్లీకవి యీక్రిందిపద్యములలోఁ దెలిపినాఁడు.

క. పారాశర్యనికృతి యయి
భారతమను పేరఁ బరగు పంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థపరిపక్వఫలము గాదె
దీని కెనపడ యక్కొని వేడ్క నూని కృతిప
తిత్వ మొందించవచ్చితిఁ దిక్కశర్మ!

ఆంధ్రభాషలో ప్రశస్తము లగు కావ్యములను రచించినవారిలో తిక్కనసోమయాజిని మొదటివానినిగా నెన్నవచ్చును. ఇంతేకాదు, పరిమాణము నందుఁగూడ నీతనితో సమానముగ గ్రంథరచనము గావించిన యాంధ్రకవు లింకొకరు లేరు. నిర్వచనోత్తర రామాయణమున దాదాపు ౧౩౦౦ పద్యములును, మహాభారతమునఁ బదునాలుగు వేల గద్యపద్యములును గలవు. ఈతని రచనములయం దేభాగమును దీసి చదివినను విసువు జనింపక యింకను జదువవలయు ననియే యుత్సాహము కలుగుచుండును.

## తిక్కన పద్యరచనము

కందపద్యరచనమునం దీతఁడు కడు నేర్పరి. మన దేశమున "పందినిఁ బొడిచినవాఁడు బంటు, కందము చెప్పినవాఁడు కవి" యను లోకనానుడి కలదు. కందపద్యములను రచించుట కష్టతరమని దీని యభిప్రాయము. కవిచౌడప్ప చెప్పిన:

"క. ముందుగఁ గను దినములలో
కందమునకు సోమయాజి ఘనుఁడందురు నేఁ
డందఱు నను ఘనుఁడందురు
కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా"

అను పద్యమునుబట్టి పూర్వకాలమునఁ దిక్కనసోమయాజి కందములు మతికెక్కినవని తెలియుచున్నది. ఇతఁడు కందపద్యములను సరసముగా రచియించుటయేకాక సంఖ్యయందుగూడ వాని నధికముగా వ్రాసియున్నాఁడు. దాదాపు ౧౩౦౦ పద్యములుగల నిర్వచనోత్తర రామాయణములో నైదువందల యిరువదిరెండు కందములున్నవి. భారతమునందలి మొత్తము గద్యపద్యములు పదునాలుగు వేలలోను మూఁడవభాగమయిదు వేల మూఁడువందలు కందపద్యములు. భాస్కరరామాయణము

న మల్లికార్జునభట్టు రచించిన భాగములోఁ గూడ మూఁటికి నలువదికి మించి కందపద్యములుకలవు. మల్లికార్జునభట్టు పేరఁగల భాగములోఁ గాలభాగము మంత్రిభాస్కరుఁడు రచించెనని యొకవాదముకలదు. ఆ వాదము సత్యమయ్యెనేని, తాతయు మనుమఁడును, కొమరులును మంత్రులు, నగుటయందే కాక, కందపద్యరచనమునఁ గూడ నొకరి కొకరు దీసిపోక వంశమర్యాదను గాపాడిరని విదితమగును. విరాట పర్వాదియందుఁ దక్కఁ దక్కిన ప్రతియాశ్వాసాదియందును దిక్కన కంద పద్యములనే వ్రాసియుండెను.

తిక్కనసోమయాజి సామాన్యముగా, శార్దూల మత్తేభాదిపద్య ములనే గాని, కవిరాజవిరాజితాది వృత్తములను రచియించుటలో నేర్పరి కాఁడని యెవ్వరో యాక్షేపింపగా స్త్రీపర్వమునఁ గష్టపడి యాతఁడు విశేషముగా వృత్తములను రచియించెనని కొందఱనుచున్నారు. స్త్రీపర్వమున వట్టివృత్తములు విశేషముగా నున్నమాట సత్యమే కాని, యెవరో యాక్షేపించిన మీఁదట వానిని రచించెననుట పథ్యముండదు. స్త్రీపర్వమందలి కథ దుఃఖకరమైనది. అందు స్త్రీపాత్రము లెక్కువగా పాల్గొని శోకపూరితములగు వాక్యములను బల్కుచుండుటగాననగును ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాతఁడు రచియించి యుండును. చంపకోత్పలములు గాని, మత్తేభశార్దూలములు గాని, స్త్రీ పర్వమున లేవు. దాదాపు నలువదివిధములగు నితరవృత్తము లిందుఁ గలవు.

ఈతఁడు రచియించిన రెండుకావ్యములలోను, నిర్వచనోత్తర రామాయణకవిత్వముకంటె మహాభారతకవిత్వము రసవత్తరమై యారి తేరి హృదయంగమముగా నున్నది. నిర్వచనోత్తరరామాయణమునఁ గొన్నితావులలో నీతనికవిత్వము నారికేళపాకములో నున్నదని కొంద ఱందురు. కాని యది సత్యముకాదు.

ఈతని కవిత్వశైలి చూపుటకిదివఱ కుదాహరింపఁబడిన పద్యములే చాలియున్నవి. ఈతని పద్యములన్నియు, రసవంతములై యుండును. అట్టివానిలో మంచివివి యనియేర్పఱుప నసంభవము. అయినను, రామాయణమునుండి యాశ్వాసమున కొకటివంతున పదిపద్యములను, భారతమునుండి పర్వమున కొకటిచొప్పున పదునెనిమిదిపద్యముల నీదిగువ నుదాహరించుచున్నాఁడను. మెచ్చుచూపుటలో మంచిచెడ్డలు రెండిటినిగూడఁ జూపుట ధర్మముకదా.

నిర్వచనోత్తర రామాయణము:

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తముగా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగ జాలిన సీతకు రుద్రచాపభం
జన మనునుంకు విచ్చి నృపసత్తముఁ బరిగ్రహించి పే
ర్చిన యుభయానురాగమునఁ జిత్తభవుం జరితార్థుఁ జేయుచుణ్ణా. ఆ౧

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగుమాల్యవంతుఁడ
చ్చెరువగు విక్రమంబునఁ బ్రసిద్ధివహించి నిజానుజన్ములం
గర మనురక్తి మన్ననఁ దగం గొనియాడుచు సర్వలోకభీ
కరుఁడయి దేవతామునినికాయము దల్లడమందుచుండగన్. ఆ౨

చ. తనయుఁడు తండ్రియగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముల్
గొనుచెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
యను వగునంతకున్ రిపుదుగ్రత సైఁచిన నింక నూరకుం
డ నగునె వేగపోరికిఁ గడంగుము నీభుజదర్పమేర్పడన్. ఆ౩

శా. కేలీకందుక వల్లి నెత్తుకొను మాడ్కిం బట్టి నాయున్న యీ
కైలాసాచల మిట్లు నీవు సోయంగా నెత్తితం జోద్యమై
నీలావేఁగొనియాడు రెల్లరును వర్ణింపంగ నీకొక్క పే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ జెంపెక్కంగ నేనిచ్చెదన్. ఆ౪

## మహాభారతము :

ఉ. ఈతఁడు గాత్రశత్రుఁడు సహింపఁగ దిగ్విజయంబు సేసె, వి
ద్యాతిశయార్థి వాసవు మహావన మైనను నెక్కినాఁడు
ద్ద్యోతితమూర్తి కౌరవకులోద్వహులం దగ్గనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీ విజితగర్వధనుం దగఁడే నరేశ్వరా. వి. ప.

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం జేరు వందించియున్
బదమూఁడేఁడులు నీవునుం దిరిగి రా పాలింప బోవచ్చునే
యది గాదేఁ దెగి బంట్లవై రణమునన్ మాయ ల్వెమ్ము నేర్పింక చె
ల్లదు సూ పికని యాసుయోధనుఁ డుల్లబుచ్చివో నాఁడు మా. ఉ.ప.

ఉ. కోపము సంహరింపు యదుకుంజర! పాండవకోటి కెల్లనుం
దేవవుగా క నీవిటుల దీఱఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁ డైన ధర్మసుతు కౌర్యము ధైర్యము భావశీర్యముల్
రూపటిపోక కాదె యనరూపమె నీ కిది లోకనాయకా. భీ.ప.

చ. వినుము కిరీటి! దివ్యశరవేదివి వాఁజను దేవ లేకచో
యను మును సెల్లకున్ విటలం జనకిత్తునె యిష్టనీబలం
బును హరి నేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చి నీవు పాండురా
జనకుఁ జనించితేనిఁ దెగి నా పురుశౌర్యమున ప్రవీర్యముల్. ద్రో.ప.

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిశ్రాంతుండు కర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గేల్వఁ జూచు నీరోఁ డాశీన్ వహ్ని య
త్యంతంబుల్ శిశిరత్వ మొందినను గోత్రాభృత్ వడంకాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణుఁ డకటా కోల్పాటు వాటిల్లునే. క.ప.

చ. చదివితి నెల్లవేదములు జన్మము లొప్పఁగఁ జేసితిం ధరా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలుర వెంటను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వహరిబద్ధవకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగుటొప్పదే. శ.ప.

చ. దురమునఁ బెంపుఁ జేసియును దర్పములీల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచక విశిష్టతలంబునఁ బోరి సద్గతిన్
బొరసెదు నీకునై వగవు పుట్టదు బంధులు రాజు దేవులున్
దిరియుదు రింక వారి దగుదీనత కోర్వక యుమ్మలించెదన్. సౌప.

మంగళమహాశ్రీ:

ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండి యును
నెంతయును భక్తిఁ గని వారుం
బ్రీతి యొసఁగం బలికి ప్రేమ మొలయం బొగడి
పెద్దయు వినీతిపరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన వి
శిష్టదయ నిమ్మనిన ధర్మం
జేతల ననూనమగు నిర్ధజయ మగు మాతలకు
నెల్లియున సిద్ధముగు నంటిన్. స్త్రీ.ప.

మ. నిజదారైకపరత్వముం గరుణయున్ నిగ్రహంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథి సంశుద్ధార్చనల్ భాగ్యభు
గ్భుజనంబున్ సకలాశ్రమస్థులకు శక్యప్రక్రియం బ్రోవు నిం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె నుర్వీశ్వరా. శాంప.

చ. అనశనవృత్తిఁ జేసి సురలాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షపమనంతరకల్పిత మైన యేకభు
క్తనియమతంత్రమున్ నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వమున్
గనిరొ మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు భూవరా. అను.

ఉ. ఉత్తర దిక్కునెత్తుకొని యొయ్యన హా వలదంగ వచ్చి యు
త్కృత్తము తేజుఁడైన పురుషోత్తము నంభ్రముల పొంత భూస్థలిం
జిత్తమెలర్పఁగా దనదు చెన్నగు ఫాలము సేర్చె నన్ముదా
యుత్తమనస్కుఁడై యతఁడు సాదరభాషల గారవించుచున్. అశ్వ.

క. మాయయ్య కాననమునకుఁ
బోయెడు సేవితనితోడఁ బోయెద శుశ్రూ
షాతత్పరనై యుండెద
నీయెడఁ గొనుచు మగిడి యేగుము తల్లీ. ఆ.వ.

చ. వలసిన నెట్టి కార్యమును వారిరి నెట్టగనైనఁ జేయఁగా
వలఁతి నృపుం బరీక్షితుని వత్సలతం బ్రదికించె శౌరి మీ
క్కలమున యాదవుల్ వెనఁగఁగాఁ గవి మాన్పఁడు పేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్యమని బుద్ధిఁ దలంచుట గానవయ్యెడున్. మౌ.ప.

చ. తనువు దొఱంగ కిల్లు సుకృతంబుల పెంపున వచ్చితి వ్రతం
బునకు మహాత్మ! యిచ్చటను బోవదు నీమదిఁ బాసి మర్త్యసం
బనుపడియున్న నెయ్యము భావములన్ శుభదృష్టిఁ జూడుమా
మునులను సిద్ధులం బగు నెమ్మనవటి చందమునొందియుండఁ గన్. మ.ప్ర

ఉ. భారతమార్గితో విసిన భక్తిఁ బఠించిన శ్రీయు వాయువున్
భూరియశంబునుం బ్రమదముల్ దృఢవీర్యముఁ గల్గు వారికిఁ
గోరిక లైన వేగ మొనఁగూడు సువృత్తునిఁ గాంచు సద్గురుల్
గారవ మొప్పఁగాఁ బడయుఁ గన్యక యుర్వరుసం కుమారియున్. స్వ.ప.

తిక్కన రచించిన యితర కావ్యములు :

(౧) విజయసేనము.

తిక్కనామాత్యుఁడు విజయసేన మను ప్రబంధమును రచించెనని యొక ప్రతీతి కలదు. ఈ క్రిందిపద్యములు విజయసేనములోనివని పెదపాటి జగ్గనవి సమకూర్చిన ప్రబంధరత్నావళిలో నుదాహరించి యున్నాఁడు. ఈ రత్నావళిని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులు గారు ప్రకటించియున్నారు. విజయసేనమిప్పు డెచ్చటను గనుపట్టుట లేదు. ఇది యొక ప్రౌఢ కావ్యమని చెప్పుచు శ్రీ చిలుకూరి వీరభద్రరావు గా

రాంధ్రులచరిత్రమున నీ క్రిందిపద్యముల నుదాహరించి యున్నారు. ఈ పద్యములు వారి కెట్లు లభించినవో తెలియదు.

"సీ. ఘనసారకస్తూరికాగంధముల నవ్య
గంధబంధంబులు గలపి కలపి,
కుసుమితవల్లికాలతికవీథులఁ జొచ్చి
కని సరోగృహముల మునిఁగి మునిఁగి,
సమధికాహార్యాంగన గీతములతోన
కన్నెతీఁగలతోట కలసి కలసి,
కుముదకహ్లారకటికోరకంబులు దూఱి
యవిదంపతుల నిద్రఁ దెలిపి తెలిపి,
గీ. యనుదినమ్మ వసంతికమ్మన గట్టు
వాలు వోలె విప్రవరుఁడు వోలె
నట్టువోలెఁ దాను నచ్చిన చెలి వోలె
మలయుచుండు మందమారుతంబు.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బెంచి వసంతుఁడు కావుగా కకై
రొల్లవనంబు నంకటచు లేనఁగఁ దా రోడికంబు మీఱ న
ట్లిల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బురాణపత్రముల్
త్రుల్లఁగఁ జేసె నట్టి కుసుమాయుధుఁడు పిచ్చలింపగన్."

విజయసేనము : (ప్రబంధరత్నావళిలోనిది)

ఉ. అల్లనఁ దొంగచూచి శిఖి నౌవలయంటిరలంబు పుచ్చి సం
ఫుల్లగఁ బాదపీఠము పొంతన యున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ గ్రోలఁగ సేయు నట్లు నా
ఖిల్లగజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన.

శా. గీర్వాణాచలసాను వాత్మరవక్రీడాహతం బైన చ
య్యుర్వీంధ్రము నంద నంత ఘనరత్నాద్యగ్రశృంగప్రభ లుర్వి ద్దృ
క్పర్వంబై పొదిగట్టి పెర్వ మది గంబంబు యంచుగ్రక్రన
గ్గర్వోన్మీలితనేత్రుఁడై మఱియు వేదండాననుం గొల్చెదన్.

సీ. పద్మంబులును పద్మపద్మరాగప్రతి
బింబములును తగ జొనిపి మెఱయఁ
గల్లోలములును రంగన్మకరాయిత
తుండములును పటు తొట్రుపడఁగ,
బిసములు విహారణరససమాగతరసా
తలనాగ శిశువుల చెలిమి సేయఁ
జక్రియుగ్మంబులు జలకేళిలోలని
తంబినీస్తనములు తమఁబడంగ

గీ. సాంపుమీఱి నట్టివెంపుచు గంభీర
తయును బరపులోవు పెద్దఁ దగిలిజనులు
సంస్తుతింప నఖిలసన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

చ. తరుణుల వీఁగుఁజన్నుఁగవ తాఁకున మన్మథచక్రవాకబం
ధురగతి లీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగుడు వడ్డతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్.

ఉ. కోనిరొద మన్నబందగుబు కోటులకమ్మదు; రమ్మఁబూని తె
చ్చిన సర కెంత పెద్దవెల చెప్పఁగ గొంత్రు తగంగ నిచ్చి; న
చ్చిన వెలతీర్చి లక్ష్మి తమ చెప్పినయట్టుల చేయు సొంపు పే
ర్కొన గణుతింప రాదు; పురకోటులం బ్రణుతింప నొప్పదే?

గీ. ఆటి విజయసేను నభిరామమూర్తి వి
ద్యావిరూఢమతి వదాన్యవరుడు
వ ధురవిధ్రమైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణంపుఁబ్రోగుఁ డగుట.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల వశీయుంబై పరీక్షించి వన్
దిత్యావ్యగ్రుఁడు గాక విగ్రహముతో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దేసం గ్రారంభియై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁ డైనంతి శౌర్యశ్రీసమేతుండగున్.

క. పరధన పరాంగనాజన
పరిహారము ధర్మపథ మందుసు స
త్పురుషులు మఱవక వీనిం
బరికింపుము విసువు మెపుడు పైశున్యంబున్.

గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృత్కోశ
రాష్ట్రదుర్గబల పరాయణులకు
నీవు నిదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రవిధుల.

ఈక్రింది సీసపద్యము తిక్కన విజయసేనము లోనిదని శ్రీ
మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.

సీ. అమ్మదననిఁ బద్మాక్షుకౌస్తుభ మైన
చెలువకు కొనికొండి చెవుఁగలిగి
విలువ యిచ్చెదమని వేఁడినఁ బులిజున్నుఁ
గమ్మఁసిండియు నమ్మగలిగి
యేవస్తు వెంత ప్రార్థించినను చనుడెంచి
కొంతటఁడిగిన నెడరఁ గలిగి

తమయింట లేనివస్తువు లర్థపతియింట
నైన వెదకిన లేవనుట గలిగి
గీ. తమకులాచార వర్తన(?)ము గొలుకు
నంగడుల యొప్పునకును చేహొరుమాట
గాని లాభమునకు గాదనంగ
వలుదురు పురవరమున వైశ్యవరులు.

ఈ పద్యమును బ్ర. శ్రీ పరిభాకరశాస్త్రిగారు తమ ప్రబంధ రత్నావళి పీఠికలో నుదాహరించుచు, పై పద్యములలో నొకటి వైశ్య వర్ణన మున్నది ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయ సేనమందలివే యగునా? యని శంకించినారు. పై పద్యములలో గణపతి స్తోత్రము రెండుపద్యములలో నున్నది. పరిఖావర్ణనము రెండు పద్యములలోఁ గన్పట్టుచున్నది. జగ్గనకవి సమకూర్పుటలో నేదైన పొరపాటు జరిగెనో? లేక తక్కినవియే యట్లు రచించెనో, చెప్పఁ జాలము. చిమ్మపూడి అమరేశ్వరుఁడను మహాకవి విక్రమసేన మను నొక ప్రబంధమును రచియించియుండెను. అందలి నాయకుఁడు విక్రమసేనుఁడు. నాయిక విషయసు(?). తక్కిన విజయసేనములోని నాయకుఁడు విజయసేనుఁడు. నాయిక పేరు లభింపలేదు. ఈ గ్రంథముల నామాక్షరములలో రెండవ మూఁడవ యక్షరములు దక్కఁ దక్కినవి సమానము లగుటచే జగ్గకవి గ్రంథనామముల నిచ్చుటలో పొరపాటు పడియె నేమో!

అప్పకవియును, కస్తూరిరంగ కవియును, వీక్రిందిపద్యము విజయ సేనములోనిఁ దని సంశయాస్పదయతికి లక్ష్యముగా నిచ్చి యున్నారు.

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిఁ దెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందె దేల యుచితస్థితికి న్ననుఁ బాఁపఁ జూపినన్

